ప్రపంచ తెలుగు మహాసభ ప్రచురణ

# బాల వాఙ్మయం

రచయిత :

శ్రీ బి. వి. నరసింహం




ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్-500 004.

# ముందుమాట

ఎన్నోఏళ్లుగా అనుకొంటున్న ప్రపంచ తెలుగు మహాసభలు జరుగనున్న పర్వ సమయం ఆసన్నమవుతున్నది. ప్రపంచంలోని తెలుగువారి ప్రతినిధు లందరిని ఒకచోట సమీకరించవలెనని పెద్దలందరూ కన్నకలలు ఫలిస్తున్న శుభసమయమిది. రాబోయే ఉగాది రెండువేల అయిదువందల సంవత్సరాల తెలుగు జాతి చరిత్రలో మరపురాని మధుర ఘట్టము కాగలదు.

క్రీస్తుపూర్వం మూడవ శతాబ్దికి చెందిన శాతవాహన రాజుల కాలం నుండి తెలుగు ప్రజలకు ఒక విశిష్టమైన చరిత్ర ఉన్నది. భారతదేశంలో తెలుగు మాట్లాడే ప్రజలు దాదాపు ఐదుకోట్లకు పైగా ఉన్నారు. హిందీ మాట్లాడేవారి తరువాతి స్థానం తెలుగువారిది. బౌద్ధపూర్వయుగంనుంచి ఇటీవల బ్రిటీష్ సామ్రాజ్య పరిపాలనాయుగం వరకూ తెలుగువారు పెద్దఎత్తున ప్రపంచం నలుమూలలకూ వలస వెళ్లడం జరిగింది. అట్లా వెళ్లిన తెలుగువారు తమ భాషా సంస్కృతి సంప్రదాయాలను ఆయా జాతీయ జీవన విధానాలతో మేళవించి, వాటిని సుసంపన్నం చేస్తుఉన్నారు.

ప్రపంచ తెలుగు మహాసభల ప్రధాన లక్ష్యం తెలుగు ప్రజల, తెలుగు అభిమానుల ప్రతినిధులను ఒక వేదికమీద సమావేశపర్చడం. జాతీయ, అంత ర్జాతీయ సాంస్కృతిక రంగాలలో తెలుగువారు చేయవలసిన కృషినిగూర్చి చర్చించి, నిర్ణయించుకోవడానికి, తద్వారా వివిధ చైతన్యస్రవంతులను ఏకోన్ముంఖంచేసి మన సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేసుకోవడానికి ఈ మహాసభలు దోహదకారులు అవుతవి. అంతేకాక ఈ మహాసభలు అర్ధవంతమైన భావసమైక్యతకు ప్రాతి పదికలై తెలుగు జాతిని సమైక్యం చేయగలవనీ, అభ్యుదయానికి తోడ్పడగలవనీ విశ్వసిస్తున్నాను.

1975 ఏప్రిల్ 12వ తేదీన తెలుగు ఉగాది రోజున ప్రారంభమై ఒక వారం రోజుల పాటు జరిగే ఈ మహాసభలలో వివిదేశాలనుంచీ, వివిధ రాష్ట్రాల నుంచి, యునెస్కోవంటి అంతర్జాతీయ సంస్థలనుంచి విచ్చేసిన ప్రముఖులు ప్రతినిధులు గానో, పరిశీలకులుగానో పాల్గొంటారు. ఈ మహాసభలసమయంలో

చర్చాగోష్ఠులు, ప్రదర్శనలు, ప్రచురణలు మొదలైన కార్యక్రమాలు జరుగుతాయి. దేశ విదేశాలలోని తెలుగువారి సంస్కృతి, తెలుగు భాషా సాహిత్యాల కళల అభివృద్ధి, వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి మొదలైన విషయాలపై చర్చాగోష్ఠులు జరుగుతవి. తెలుగువారి సాంస్కృతిక వైభవాన్ని వివిధ కోణాలనుంచి ప్రస్ఫుటం చేసే ఒక ప్రదర్శన ఏర్పాటు అవుతుంది. తెలుగువారి సమగ్ర స్వరూపాన్ని సందర్శించడానికి వీలైన సంగ్రహాలయాన్ని /మ్యూజియంను/ స్థాపించడానికి ఈ ప్రదర్శన బీజ భూతమవుతుంది. తెలుగువారి సంస్కృతిని నిరూపించే సాంస్కృతిక కార్యక్రమాలు వారం రోజులపాటు సాగుతవి. తెలుగు ప్రజల సంస్కృతి సంప్రదాయాలను విశదంచేసే ప్రత్యేక సంచిలు తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఉర్దు భాషలలో విడుదల అవుతాయి. ఈ కార్యక్రమాలలో భాగమే ఈ గ్రంథ ప్రచురణ

తెలుగు ప్రజలు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, కళలు మొదలైన వివిధ రంగాలలో సాధించిన ఘనవిజయాలను విశదం చేసే గ్రంథాలు అనేకం ఈ మహాసభల సమయంలో విడుదల అవుతాయి. ఈ గ్రంథాలను రచించి, సకాలంలో మాకు అందించిన రచయితలందరకూ నా కృతజ్ఞతలు. ఈ గ్రంథాలనుప్రచురించే భారం వహించడానికి ముందుకు వచ్చిన అకాడమీ అధినేతలను అభినందిస్తున్నాను. తెలుగువారి విశిష్టతలను విశదంచేసే ఈ గ్రంథాలు సహృదయులందరి ఆదరణ పొందగలవని విశ్వసిస్తున్నాను. అయితే, ఇంత మాత్రం చేతనే ప్రపంచ తెలుగు మహాసభల ఆశయాలు సఫలం కాగలవని నేను అనుకోవడంలేదు. చేయవలసింది ఇంకా ఎంతో ఉంది. ఈ మహాసభల సందర్భంగా నెలకొల్పబడనున్న 'అంతర్జాతీయ తెలుగు విజ్ఞాన సంస్థ' మహాసభల ఆశయ సాధనకు పూనుకొనడమే కాక జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేయగలదని నమ్ముతున్నాను.

జలగం వెంగళరావు

అధ్యక్షులు

ప్రపంచ తెలుగు మహాసభలు.

# ప రి చ య ము

సహస్రాబ్దాలుగా ప్రవర్ధమానమగుచున్న తెలుగు సంస్కృతిని తెలుగు దేశపు యెల్లలు దాటి బయట ఉన్నవారికి పరిచితము చేయు సంకల్పముతో 1975వ సంవత్సరమును తెలుగు సాంస్కృతిక సంవత్సరముగ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ప్రకటించినది. అందుకు అనుగుణమైన కార్యక్రమాలను నిర్వహింపజేయుటయేగాక, ప్రపంచములోని వివిధ దేశాలలో వసించుచున్న తెలుగువారి సాంస్కృతిక ప్రతినిధులందరును ఒక చోట సమావేశమగు వసతిని కల్పించుటకై '1975, ఏప్రిల్ 12 (తెలుగు ఉగాది) మొదలుగ ప్రపంచ తెలుగు మహాసభ హైదరాబాదున జరుగు నటుల ప్రభుత్వము నిర్ణయించినది. అందు ఒక ఆహ్వాన సంఘము ఏర్పాటయినది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముఖ్యమంత్రి మాన్యశ్రీ జలగం వెంగళరావుగారు ఆ సంఘమునకు అధ్యక్షులు, విద్యాశాఖామంత్రి మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు దాని కార్య నిర్వాహకాధ్యక్షులు, ఆర్థికమంత్రి మాన్యశ్రీ పిడతల రంగారెడ్డిగారు ఆర్థిక, సంస్థా కార్యక్రమాల సమన్వయ సంఘాల అధ్యక్షులు.

ఆ సంఘము, ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున వచ్చువారికి తెలుగుజాతి సాంస్కృతిక వైభవమును తెలియజేయుటకు అనువుగ ఆంధ్ర భాష సాహిత్య, కళా చరిత్రాదికములను గురించి ఉత్తమములు, ప్రామాణికములునగు కొన్నిలఘు గ్రంథములను ప్రకటించవలెనని సంకల్పించి. ఆ కార్య నిర్వహణకై 44 మంది సభ్యులు కల ఒక విద్వత్ సంఘమును, శ్రీ నూకల నరోత్తమరెడ్డిగారి అధ్యక్షతన నియమించినది. ఆ విద్వత్‌సంఘము ఆ లఘు గ్రంథముల వస్తువుల నిర్దేశించి వాని రచనకై ఆయారంగములందు పేరుగనిన ప్రముఖులను రచయితలుగ యెన్నుకొనినది. ఈ విధముగ సిద్ధమైన గ్రంథములలో భాషా, సాహిత్య, చారిత్రిక విషయములకు సంబంధించిన వానిని ప్రకటించు బాధ్యతను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వహింప వలసినదిగ ప్రపంచ తెలుగు మహాసభాకార్యనిర్వాహకాధ్యక్షులు మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు అకాడమీని కోరిరి. మహాసభా సఫలతకొరకై కృషి చేయు సంకల్పముతో ఈ బాధ్యతను వహించుటకు అకాడమీ సంతోషముతో అంగీకరించినది.

ఆ విధముగ ప్రకటింపబడిన గ్రంథశ్రేణిలో ఈ బాల వాఙ్మయం అను గ్రంథమును, రచించిన శ్రీ బి. వి. నరసింహంగారు ఆంధ్ర పాఠక లోకమునకు సుపరిచితులు వారికి మేము కృతజ్ఞతాబద్ధులము. గ్రంథమును నిర్దుష్టముగ, చక్కగ ముద్రించిన ప్రోగ్రెసివ్ ప్రెస్ వారికి మా కృతజ్ఞత.

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

హైదరాబాదు,
తేది 30-3-75

# బాల వాఙ్మయం

ఆంధ్ర ప్రదేశ్ విద్యా శాఖా మాత్యులు శ్రీ మండలి వేంకటకృష్ణారావు గారు ఆ మధ్య "పిల్లలలోని స్నేహం, సౌశీల్యం, శాంతి కాముకత, క్రాంతి భావుకత పెద్దలకు దేశానికి ఆదర్శం కావాలి. తెలుగు మాతృభాషగా గల బాల లందరిలోను ఒక సమగ్ర సంఘటిత చైతన్య శక్తిని పెంపొందించవలసిన అవ సరం ఉంది. బాలల ఆలోచనలు, అభిరుచులు, ఆశలు, ఆశయాలు జాతి జీవన గతిని నిర్ణయిస్తాయి. వాళ్ళ ఆట పాటలు, చదువు సంధ్యలు, వాళ్ళ మనోవికా సానికి ముఖ్య సాధనాలు. మాతృభాష వాళ్ళ సర్వతోముఖ పురోగమనానికి పునాది." అని ఎంతో గొప్పగా తమ అభిప్రాయం వెలిబుచ్చారు.

పై అభిప్రాయాన్ని పురస్కరించుకొని ఈ సమయాన ఆంధ్రులందరూ బాలవాఙ్మయాన్ని ఆది నుండి నేటివరకు రూపంది ప్రచారమందున్న దానిని సమగ్రంగా సమీక్షించి ఒక చక్కని వివేచనను పొందాలి. అంతేకాదు ఈ సారస్వతం భవిష్యత్తులో పిల్లల సర్వతోముఖాభివృద్ధి కెలా తోడ్పడుతుందో నిర్వచించి నిర్ణయించాలి. ఈనాటి మన ఆలోచనలు ఆశలు, ఆశయాలు రేపటి వారి కెంతో వెలుగుబాటలు కాగలవు. వెలలేని మేలు సేకూర్చగలవు.

## 1

బాల్యం వంటిదే బాలవాఙ్మయం. బాల్యంలో సూచన ప్రాయంగా గోచ రించిన లక్షణాలే తరువాతి దశలలో వికసిస్తాయి. అలాగే బాలవాఙ్మయంలో అంకుర ప్రాయంగా కానవచ్చిన కవితాలక్షణాలే ప్రౌఢ రచనల్లో అనలుగా కొనలుగా అల్లుకొని వ్యాపిస్తాయి. సరళాక్షర సంపద, యతిప్రాసల పొందిక, లయగతి ఆంధ్ర కవితకు అవతారంనాడే అమరిన వన్న సత్యం ఈ బాలవాఙ్మయం ప్రస్ఫుటం చేస్తుంది.

బాల వాఙ్మయం జానపద వాఙ్మయంలో ఒక ప్రత్యేక విభాగం. ఇది లయాత్మకమైన గేయ రూపంలోనే ఉంది. ప్రపంచంలో ఏ వాఙ్మయంలోనైనా

కవిత్వం తొలుత గేయ రూపంలోనే అవతరించింది. తరువాత క్రమం పద్యం, గద్యం.

ప్రకృతి ప్రథమావస్థ చలనం. బాల ప్రకృతిలో ఆ చలనం అంటే లయ స్పందనం పుష్కలంగా వుంటుంది. ఊహావేశం ఉరకలు వేస్తూ ఉంటుంది. లయస్పందనానికి ఊహావేశం తోడైనప్పుడు అశువున కవిత్వం అప్రయత్నంగా వెలువడుతుంది. సరిగా బాల వాఙ్మయ సృష్టి ఇలాగే జరిగింది. ఈ సృష్టికి కర్తలు పిల్లలు, పిల్లల మనస్సు కలిగిన తల్లులు, దాదులు, పెద్దలు ఎందరో! చెప్పలేము.

డాక్టర్ బి. రామరాజు గారన్నట్లు "మానవుడు నాగరకతా సౌధ నిర్మాణానికి పునాదులు త్రవ్వేటప్పుడు అప్రయత్నంగా, అనాలోచితంగా అతని నోటి నుండి వెడలిన పృధ్వీగంధ సంవాసితాలైన మాటలు గంధవహుడు నడచే బాటల్లో పాటలై దేశ పరిభ్రమణంలో ఒకచోట విరిగి మరియొక చోట తరిగి ఇంకొక చోట పెరిగి జానపదగేయ మయ్యింది."

పామరులైన జానపదులు ప్రకృతి ప్రత్యక్షమునకి పులకించి ఆపుకోలేని ఆనందావేశంలో ఋక్కులు గానం చేసిన ఋషులవలె అప్రయత్నంగా అర్థానికి మించిన అందమైన మాటల మానికతో పాటలుకట్టి పాడారు.

ఈ పాటలను ఆస్వాదించడానికి సహృదయత ఒక్కటే చాలదు; సానుభూతి కూడ కావాలి.

ప్రాచీన బాల గేయాలు వ్రాయబడలేదు. అవి అలేఖ్యం (un-written). ఒకరి నుండి ఒకరు వింటూ పాడుకొంటూ వాక్ప్రచారం వల్ల వాటిని పదిలపర్చుకుంటూ వచ్చారు. లోకుల వాకులందే అవి పుట్టి పెరిగినవి.

బాల వాఙ్మయంలో జాతీయతా ముద్ర సుస్పష్టం. జాతి జీవనం పూర్తిగా ప్రతిబింబిస్తుంది. తెలుగు బాలల తీయతేనె మాటలు. చిత్రమైన ఆటలు. ఊహలు పోహలు వింతలు వినోదాలు సమస్తం వ్యక్తమౌతాయి.

ఇందులో కథా వస్తువు జనసామాన్యానికి సుపరిచితం. భాష సులభ గ్రాహ్యం. శైలి నిరాడంబరం, నిర్మలం. పది మందీ పాడుకోదానికి అనుకూలంగా ఉండే లయఫణితులున్నాయి ఇందులో అనేకం.

విశేషమేమంటే జానపద వాఙ్మయంలో సామాన్య ప్రజానీకానికి సముచిత స్థానం ఉంది. సంతోషం పంచుకోవడంలో అందరూ సమానమే నన్న భావం నెలకొంది. జానపద సాహిత్యానికి విమర్శకుల దృష్టిలో ఉన్నత స్థానం లేకపోయినా భవిష్య సాహిత్యానికది ప్రాతిపదిక కాకపోలేదు.

ఈ గేయ రచనా కాలం కర్తృత్వం తెలియదు. నన్నెచోడుడికి నన్నయకు పూర్వమే ఇట్టి గేయ రచనలు పెక్కులు తెలుగునాట కలవన్న నిదర్శనలున్నవి. నన్నెచోడాదులు ఇలాంటి వానిని పేర్కొన్నారు. పాల్కురికి సోమనాథుడు ప్రచారములో ఉన్న కొన్ని ఆటల పేర్లు ఇలా పేర్కొన్నాడు.

పొందంగ 'రాగుంజ పో గుంజ లాట'
కుందెన 'గుడి గుడి గుంచంబు లాట'
'అప్పల విందుల యాట' పల్మారు
చప్పట్లు వెట్టెడు 'గురిగుంజ లాట'
'చేరబొంతల యాట' 'చిట్ల పొట్లాట'
'గోరెంతలాట' దాగుడుమూతలాట.'

ఆనాడు పిల్లలకు పాటలు లేని ఆటలంటూ సామాన్యంగా లేవేమో ననిపిస్తుంది. అంతేకాదు నాటి పల్లె ప్రజలు ఉత్సాహంగా తాముచేసే ప్రతి పనికీ ఊతగా పాటలను ఉపయోగించే వారు. నేటికీ మన గ్రామ సీమల్లో ఈ యలవాటుంది. పాటల ప్రభావం బ్రతుకుబాటలో అనివార్యం.

చిన్న పిల్లల పాటలు ఇన్ని రకాలని చెప్పడానికి అలవికాదు. వాళ్ళ ఊసుల వలె అవి అనంతం. ఈ పాటలు కొన్ని యావదాంధ్రకు చెందినవి. కొన్ని చాళుక్య సీమకు (సర్కారు జిల్లాలు) కొన్ని కాకతి సీమకు (తెలంగాణా) కొన్ని రాయలసీమకు ప్రత్యేక ప్రత్యేకంగా చెందినవి ఉన్నాయి. ఆయా మండ

లాల ముద్రలు యాసలు కలిగిఉన్నాయి. ప్రాంతం నుండి ప్రాంతానికి ప్రయాణం చేసినప్పుడు ఇందులో చేర్పులూ మార్పులూ జరుగుతూ వచ్చాయి.

ఈ ప్రాచీన గేయ వాఙ్మయం మనకు తర తరాల నుండి సంప్రాప్తమైన జాతీయ సంపద. అనాదరణ వల్ల, అశ్రద్ధ వల్ల అధిక భాగం కోల్పోయాము. సహృదయులు సారస్వతప్రియులు కొందరు ఈ యమూల్య సంపదను కొంత మట్టుకు సంపాదించి మన కందించారు. వారికి తెలుగు వారెంతైనా ఋణపడి ఉంటారు. ఈ వాఙ్మయ సేకరణలో, వివరణలో తోడ్పడింది ముఖ్యంగా—వేటూరి ప్రభాకర శాస్త్రి, జి. ఆర్. సుబ్రహ్మణ్యం. పి. రామచంద్ర రావు, పురాణం సూరిశాస్త్రి, మల్లంపల్లి సోమశేఖరశర్మ, గిడుగు రామమూర్తి, గిడుగు వేంకట సీతాపతి, చేకుమళ్ళ అచ్యుతరావు, చేకుమళ్ళ రాజగోపాలరావు, చేకుమళ్ళ కామేశ్వరరావు, నేదునూరి గంగాధరం, తూమాటి దొణప్ప, బి. రామరాజు, శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, గొ్రెపాటి వెంకటసుబ్బయ్య గారలు మొదలైన వారు.

ఈ వాఙ్మయ ప్రచురణకు తోడ్పడిన పత్రికలు గ్రంథాలు—జనవినోదిని పత్రిక, ఆంధ్ర గ్రంథాలయ సర్వస్వము, కృష్ణా పత్రిక, Indian Antiquary, భారతి, గృహలక్ష్మి, Modern Review, ప్రతిభ, గిడుగు రామమూర్తి గారి వ్యాస సంగ్రహం, South Indian Research, చేకుమళ్ళ కామేశ్వరరావు గారి "సాంప్రదాయిక విజ్ఞానం", వేటూరి ప్రభాకరశాస్త్రి గారి "బాలభాష", గొర్రెపాటి వెంకటసుబ్బయ్య గారి "నవ్వులు—పువ్వులు" డాక్టరు బి. రామరాజు గారి 'తెలంగాణా పల్లె పాటలు', ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారి సహాయంతో ప్రచురితమైన 'త్రివేణి' (ఆంధ్ర దేశ జానపద గేయ సంపుటి), ఆంధ్ర సారస్వత పరిషత్తు హైదరాబాదు వారి బాల సాహిత్య మాలా ప్రచురణలు మొదలైనవి.

వివిధ విభాగావరణలు గల ఈ గేయాత్మక బాల వాఙ్మయాన్ని స్థూలంగా దర్శిద్దాం.

బిడ్డలను దొడ్డ వరాలుగా ఎంచి, వారిని కన్నందుకు తమ జన్మ ధన్యమైనదని భావించి ఆనందించే మాతృమూర్తుల భావాలు మల్లెల సౌరభాలు.

లాభమ్మ లాభమ్మ ఏమి లాభమ్మ
కొడుకులను గంటేను కోటి లాభమ్మ.
కన్న కానుపు లెల్ల కడు చక్కనైతె
కన్నుల పండుగే కన్నతల్లికిని :
నిద్రనుండి బిడ్డను "మేలుకో నా తండ్రి మేలుకోవయ్య
మేలుకొని లోకాలు ఏలుకోవయ్య" అని లేపి,

"ఊఁ ఊఁ ఉంగన్న ఉగ్గుపాలు ఇందన్న" అని ఉగ్గు పెడుతుంది, 'జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం, గుగ్గిళ్ళు తిన్న గుగ్గిళ్ళు జీర్ణం' అని కుడికాలు ఎడమచేయి, ఎడమ కాలు కుడి చేయి పట్టుకొని సుతారంగా లాగి బిడ్డకు చిన్న వ్యాయామ మిస్తుంది. తరువాత పాలిచ్చి ఊయల్లో పరుండబెట్టి లాలి పాటలు ఆలపిస్తుంది. జోల పాటలు పాడి నిదురబుచ్చుతుంది.

వింత వింత గతుల్లో సాగే లాలి పాటలు, జోల పాటలు :—

1. జో అచ్యుతానంద ! జో జో ముకుందా !
లాలి పరమానంద ! రామ గోవిందా !

2. శ్రీరమ్య దేహ లాలీ మా ముద్దు
చిన్నారి కూన లాలీ :
గారాల కూచి లాలీ, మా యప్ప
కంజాత నయన లాలీ.

ఈ పాటలు, భాష. శైలిబట్టి చూస్తే ప్రౌఢ కవుల రచనలనిపిస్తాయి. ఏనుగు లక్ష్మణ కవి పెద్దాపురం రాజకుమారుని మీద చెప్పిన ఒక పాట—

అప్పా రావోయీ ఒప్పుల కుప్పా రావోయీ
తప్పాటడుగూ విడుచూనూ మా తండ్రీ రావోయీ.
అంగిలోపలా నీ బొజ్జా ఆకలి గొన్నాదీ
బంగారు నా తండ్రీ నీకూ పాలూపోసేనూ :
పాలూ బువ్వాతిని తొట్టెలో పవ్వళించితే
లాలీ పాటాలాతో నిన్నూ జోలా పాడేనూ....

ఇలాంటిదే మరొక కవికృత గేయం—

చిన్నారి పొన్నారి చిరుత కుఱ్ఱడ రార !
అయ్య రార ! చక్కనయ్య రార !
అల్లారు ముద్దుల పిల్లవాడా రార !
అప్ప రార ! కూర్మికుప్ప రార !
రత్నాల చిటిముల్లె రార ! నవ్వుం బువ్వు
తోట రార ! ముద్దు మూట రార !
ముత్యాల క్రోవిరా ! ముచ్చట్ల దీవిరా !
పలుకు వెన్నెల చిన్న చిలుక రార !
కన్నకాచీ రార ! గారాల కూచి రా !
నాన్న రార ! చిన్నియన్న రార !
ఆడరార ! నవ్వులాడ రార ! పలుకు
లాడరార ! కులుకు లాడ రార :''

ఈ పాట అందరికీ పరిచితం—

గోరంత దీపమ్మ కొండలకు వెలుగు
గోపాలకృష్ణమ్మ గోవులకు వెలుగు :
మాడంత దీపమ్మ మేడలకు వెలుగు
మా చిన్ని అబ్బాయి మా కళ్ళ వెలుగు . . .

ఏడ్చే కుమారుని అనునయిస్తూ తల్లి—

ఏడవకు ఏడవకు వెర్రినా తండ్రి
ఏడిస్తె నీకళ్ళు నీలాలు కారు
నీలాలు కారితే నే చూడలేను
పాలైన కారవే బంగారు కళ్లు : అని పాడుతుంది.

ఉయ్యాలలోని బిడ్డ చంక కెక్కినప్పుడు అమ్మ వానికి చందమామను చూపిస్తూ—

చందమామ రావె జాబిల్లి రావె
కొండెక్కి రావె గోగుపూలుతేవె
బండెక్కి రావె బంతిపూలుతేవె, అని పాడుతుంది.

చిట్టి పిడతలో పండిన మెత్తని అన్నం గుజ్జుగాచేసి, గోరుముద్దలు గుజ్జు ముద్దలు చేసి 'అమ్మ ముద్ద-నాన్న ముద్ద' అని 'దొంగొస్తాడో దొరొస్తాడో' అని బులిపిస్తూ మరపిస్తూ అన్నం తినిపిస్తుంది.

కాస్త కూర్చో నేర్చిన బాలుని అమ్మ—
రక్ష రక్ష సంధ్య రక్ష । దివ్య రక్ష
చిన్ని నా అబ్బాయికి శ్రీరామరక్ష-అంటూ

'హాయి హాయి హాయి । ఆపదలు కాయి' అంటూ
'తారంగం తారంగం తాండవకృష్ణా తారంగం'-అంటూ
'తిందాం తిందాం అటుంది ఒకవేలు
ఎట్లా తిందాం అంటుంది ఒకవేలు'-

అంటూ రకరకాలైన పాటలు పాడి రకరకాలుగా ఆడించి అలరిస్తుంది.

పిల్లలు ఇంచుక పెద్దవాళ్ళయినప్పుడు అమ్మ వాళ్ళనాడించ వలసిన అవసరం లేదు. అమ్మ పాటలూ వాళ్ళకవసరం లేదు. తామే ఆడుకోగలరు : పాడుకోగలరు. ఆడపిల్లలకు ప్రత్యేకమైన ఆటలూ పాటలున్నాయి. మగ పిల్లలకు ప్రత్యేకమైన ఆటలూ పాటలున్నాయి. అందరికీ సంబంధించిన ఆటలూ పాటలున్నాయి. ఆటల్లో పాటల్లో నిమగ్నమైన పిల్లలు తమ బోసినవ్వుల్లో వెన్నెలలు విరియిస్తారు. పసిహృదయ తంత్రులను మీటే పదగతి ఆ పాటల్లో ఎంతో ఉంది. భావాల కంటే దీనిదే ప్రథమ స్థానం. బాలలకు కావలసిన ఆనందానుపానం. ఈ పాటలు మాత్రగణ బద్ధాలు. మూడు, నాలుగు, ఐదు, ఏడు, మాత్రల గతుల్లో—త్రిశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్ర గతుల్లో సాగుతాయి.

బాలబాలికల తొక్కు పలుకులతో ప్రశ్నోత్తరాలుగా ముక్త పదగ్రస్తంలో సాగిన ఒకపాట

పిట్టమ్మాపిట్ట ! ఏమిపిట్ట ? చిలక పిట్ట
ఏమిచిలక ? తెలుపు చిలక
ఏమి తెలుపు ? హంస తెలుపు—ఇలాగ.

1. కాళ్ళాగజ్జీ కంకాళమ్మా 2. చెమ్మచెక్క చేరడేసి మొగ్గ 3. ఒప్పులకుప్పా ! ఒయ్యారి భామా ! 4. సీతమ్మవాకిటా చిరుమల్లెచెట్టు (సంపె గొబిప పాట) 5. ఒక్క ఓ చెలియా; రెండూ రోకళ్లూ, మూడూ ముచ్చిలకా, నాలుగు నందన్నా; (గచ్చకాయలాట) 6. తద్ది పాటలు 7. బొమ్మలపెళ్ళి పాటలు 8. బుజ బుజ రేకుల పాట 9. కొండమీద వెండిగిన్నె, కొక్కిరాయి కాలు విరిగె.—ఇది ఆడపిల్లల కనువైనవి.

1. దాగుడు మూతలు 2. గుడుగుడు గుంచం 3. నాలుగు స్తంభాలాట 4. బలాబలాలాట (Tug of war) 5. జడిపించే పాట. నూకలు పెడతా మేకలు కాస్తావ్ ? 6. తప్పట్లోయ్ తాళాలోయ్ దేవుని గుళ్లో బాజాలోయ్. మగ పిల్లల కనువైన పాటలు.

పిల్లలకు పరాచకాలు, నవ్వ పట్టించడాలు, వరస పాటలు అంటే ప్రత్యేకమైన ఇష్టం.

1 బావా ! బావా ! పన్నీరు : బావను పట్టుక తన్నేరు.

2. వదినగారూ మీరు వాసిగలవారు ! వండబోయినచోట కుండనాకేరు

3. చక్కిలాల బుట్ట చంకబెట్టుకొని ! సభలోన మాబావ సంగీతపరుడు.

4. అత్తింటి కోడలూ అలిగిపడుకుంది ! అలుకల్లు తీర్చవే ములుకుల్లకట్ట

5. వదినా వదినా వల్లంకి పిట్టా ! గదిలోపెట్టా, గంజినీళ్లు కొట్టా !

పొడుపు కథ పాటలు పిల్లల కాసక్తి గొలిపి, వాళ్ల నాలోచింప జేస్తాయి.

1. వంకర టింకర మాను ! వయ్యారి మాను
మామ లెక్కే మాను ! మా వూరొచ్చేమాను. (పల్లకి)

2. చెయ్యని కుండ ! పొయ్యని నీళ్లు
వెయ్యని సున్నం ! తియ్యగ నుండు. (కొబ్బరికాయ)

3. ముక్కు మీదకెక్కు । రెండు చెవుల నొక్కు
టక్కు టక్కు నొక్కు । జారితే పుటుక్కు. (కళ్లజోడు)
4. చింపిరి చింపిరి గుడ్డలు । ముత్యాలవంటి బిడ్డలు. (మొక్కజొన్నకండె)
5. అడవిలో పుట్టింది । అడవిలో పెరిగింది
మా యింటి కొచ్చింది । తైతక్కలాడింది. (కవ్వం)
6. గోడమీద బొమ్మ । గొలుసుల బొమ్మ
వచ్చిపోయే వారికి । వడ్డించు బొమ్మ. (తేలు)
7. పచ్చని పెట్టెలో । విచ్చుకోనుంది
తెచ్చుకోబోతేను । గుచ్చు కుంటుంది. (మొగలి పువ్వు)

తరువాతదశ పిల్లలు మరికొంత పెద్ద పాటలు పాడుకొంటారు. ప్రకృతి వర్ణన గీతాలు, ఎత్తు పలుకులున్న పదాలు, ప్రశ్న జవాబులతో గొలుసు కట్టుగా సాగి గీతాలు, కథా గీతాలు, ముక్త పదగ్రస్తాలతో నడిచే కొంచెం ప్రౌఢ గీతాలు పాడుకొని ఆనందించగలరు.

'కృష్ణమ్మ' అన్న ఎత్తు పలుకుగలిగి, బువ్వ, పప్పుకూర, నెయ్యి, పెరుగు, అనే భోజన పదార్థాల వరుస క్రమం కలిగి, అవ్వ బువ్వ, అప్పు పప్పు, బీరకూర, చెయ్యి నెయ్యి, పొరుగుపెరుగు అనే అనుప్రాస అందం కలిగి 'అమ్మ కామాక్షమ్మ'ను మ్రొక్కడంలో ముగింపు కలిగిన పాట చాల గొప్పది అన్నివిధాలా. ఈ రకం పాట లింకా ఉన్నాయి. 'వానలు కురిసే దెందుకురా ?' అన్నది గొలుసుకట్టుగా సాగే ప్రశ్నోత్తరాల పాట. సత్య పురుషులగన్న సాధ్వి పేరేమి ?' అన్నది రామకథా గీతం. 'సూర్యనారాయణా వేదపారాయణా !' అన్నది ప్రకృతి (సూర్యుని) వర్ణనగీతం. ఇలా ఎన్నో ఎన్నో పాటలున్నాయి. తుమ్మెద పాటలు, వెన్నెల పాటలు, కోవెల పాటలు' ఆనందపదాలు, పర్వతపదాలు, వాలేశుపదాలు.

పిల్లల బుర్రల్లో మౌలికమైన భావాలను నాటడానికి ఉద్దేశించిన పాటలు కొన్ని ఉన్నాయి. ఉదాహరణకు—

1. విద్యలేకుంటేను విభవమ్ము రోత
వినయమ్ము లేకుంటే విద్యాలూ రోత.

2. కానివారితోను కావించు చెలిమి
   కట్టె విరిచీ పొయిని పెట్టినట్లుండు.
3. అయినవారితోను కావించు చెలిమి
   ఆకు మడచీ మడత పెట్టినట్లుండు.
4. ఉన్న ఊరూ విడిచి ఉండనే లేము
   కన్న తల్లిని విడిచి ఘడియుండ లేము
5. జపతపంబుల కన్న, చదువు సాముల కన్న, ఉపకారమే మిన్న.

ఈ ప్రాచీన బాల వాఙ్మయంలో వాస్తవికత, స్వచ్ఛందత, ఆమాయకత కొట్టవచ్చినట్లు కనబడతాయి. విద్యాగంధం. నాగరికతా వాసన అంటని జాన పదుల్లో సంస్కారం ఉండదని కాని, విద్యాధికులై నాగరికులలోనే సంస్కారం ఉంటుందని కాని భావించడానికి వీలులేదు. సంస్కారం అనేది పుట్టుకతో వచ్చే ఒక సహజగుణ సంపద. అది పరిసర ప్రభావం చేత పరిఢవిల్లుతుంది. అదొక వరం. పవిత్రము ప్రశాంతము అయిన పల్లెవాసుల ఉల్లములందు, జీవితము నందు నిండుగా ఉన్న సంస్కార సంపదకు నివ్వాళులెత్తింది ఈ వాఙ్మయం. ఈ చూపుతోనే వాటికి విలువిచ్చి వెలగట్టాలి. నేటి మన సంఘంలో 'విద్యాధికులం' నాగరకులం' అని చెప్పుకొనే వారిలో ఎంతమంది సంస్కార విహీనులూ, మానవతా విదూరులూ ఉన్నారో మనం చూస్తునే ఉన్నాం.

ఈ వాఙ్మయ పరిశీలనబట్టి మనం గ్రహింప వలసింది మరొకటుంది. ఏమంటే జానపద వాఙ్మయం ప్రాచీన కాలానికి చెందిందని, అర్వాచీన కాలానికి చెందదని చెప్పడం సబబుకాదు. ఇది ప్రాచీన కాలంలో వేరుదన్ని, దేశకాలాను గుణంగా నవనవోన్మేష మందుతూ అవ్యాహతంగా, అవిచ్ఛిన్నంగా ప్రవహించే పవిత్ర నిర్ఝరిణిలాంటిది. దీనికున్న స్థానం గౌరవం ఎప్పటికీ తరగనిదీ చెరగనిదీ.

## 2

బాల వాఙ్మయంలో నూతన శకారంభకులుగా శ్రీ కందుకూరి వీరేశ లింగంగారిని, శ్రీ గురజాడ అప్పారావుగారిని పేర్కొనవచ్చు. జాతి యొక్క

అజ్ఞాన స్థితిని అంధానుసరణ స్థితిని గుర్తించి, వారు ప్రజల్లో తగిన ఆలోచనను, హేతువాదాన్ని కల్పింప బూనుకొన్నారు. ఆ మహా సంస్కర్తలు బాల వాఙ్మయానికి నవజీవాన్ని ఆశను ప్రసాదించిన ఆదిమూర్తులు.

పాఠ్యపుస్తకాల్లో సంస్కరణాత్మకమైన మార్పులను తెచ్చిన ఘనత శ్రీ వీరేశలింగంగారికే దక్కుతుంది. అటు జానపద గాథలను ఇటు విజ్ఞానశాస్త్ర విషయాలను సమన్వయ దృష్టితో సంతరించి వాచక పుస్తకాలను తయారు చేశారు. అలాంటి చక్కని పుస్తకాలను మరెవ్వరూ తయారు చేయలేక పోయారు. వారి పిమ్మట శ్రీ చింతా దీక్షితులుగారొక్కరే లీలావాచకాల్లో ఆమార్గం అనుసరించి సుసంప్రదాయం నెలకొల్పారు.

శ్రీ వీరేశలింగంగారు యీసపు కథలను ఇంగ్లీషునుండి తెలుగుభాష కనుకూలంగా నీతిపద్యాలతో వచన రూపాన అనువదించి రెండు సంపుటాలుగా 1899 లో ప్రకటించారు.

చిన్నచిన్న కథలు. భాష సులభగ్రాంథికం. కొన్ని కథలు పూర్తిగా పద్యాలలోకి కూడ అనువదించారు. ప్రతి కథ చివర ఒక గీతపద్యాన్ని చేర్చారు. అందులో కొన్ని పాదాలు——

1. బూటకములైన విద్యలు నూటి కంటె
   ఉత్తమంబైన సద్విద్య ఒకటిమేలు.
2. అరసి చూడంగ ఐకమత్యంబుతోడ
   ఉర్వి సరివచ్చు బలము వేరొకటి లేదు.
3. కరుణగల మిత్రుడైనది కానిదియును
   కష్టకాలంబుననె సుమ్ము కానవచ్చు.
4. సర్వ విధముల తనతోడి సములతోడ
   చేయుమైత్రియె సర్వదా శ్రేయమిచ్చు.

గురజాడ అప్పారావుగారు పిల్లలు మొదలుకొని సామాన్య ప్రజలందరూ సులభంగా అర్థం చేసుకొనే వ్యావహారిక భాషను, ముత్యాల సరాలవంటి దేశి కవితా ఛందో రీతులను స్వీకరించి కన్యక, 'పుత్తడిబొమ్మ పూర్ణమ్మ' అనే

కరుణరస భరితాలైన గేయకథలను అందించారు. సంస్కరణాయుతమైన క్రొత్త చూపు ఆలోచన ప్రజలకు కలిగించారు. శ్రీ అప్పారావుగారు రచించిన గొప్ప గీత—

దేశమును ప్రేమించుమన్నా
మంచియన్నది పెంచుమన్నా ।

వట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్ ।
పాడి పంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటు పడవోయ్ ।

తిండి కలిగితె కండ కలదోయ్
కండ కలవాడేను మనిషోయ్ ।

ఈసురో మని మనుషులుంటే
దేశమే గతి బాగు పడునోయ్ ।

దేశమంటే మట్టి కాదోయ్
దేశ మంటే మనుషులోయ్ ।

అన్న దమ్ముల వలెను జాతులు
మతము లన్నీ మెలగ వలెనోయ్ ।

మనసు లొకటై మనుషులుంటే
జాతియన్నది లేచి పెరిగీ
లోకమున రాణించునోయ్ ।

పిల్లల మనఃక్షేత్రాల్లో అదనులో పడే మేలి విత్తనాలు ఈ గీతంలోని భావాలన్నీ.

శ్రీ వీరేశలింగంగారి పద్ధతిని ఒక కొంత శ్రీ వేలూరి శివరామశాస్త్రి గారు అనుసరించారు. పిల్లలకోసం 122 చిన్న చిన్న 'బాల విజ్ఞాన కథలు' ఒక పుస్తకంగా ప్రకటించారు. హృద్యమైన వాడుక భాష. ప్రతికథ చివర నీతిని సూచిస్తూ అనుప్రాసంతో ఒక ద్విపదను చేర్చారు.

ఆ ద్విపదలు కొన్ని—

1. రవ్వంత చెడ్డలో వ్రాలితివేని
కొండంత మంచికి కొందువు హాని ।
2. మంచి చెప్పిన చేయమానిన వాడు
ఇంచు మించుగ సుఖహీనుడేనాడు ।
3. ఒక్కొక్క దినమున ఒక్కొక్క తప్పు
దిద్దితే చేరుదు దివ్యమౌ చొప్పు ।
4. తండ్రి బిడ్డకు దారి తాజూపవలయు
సంతు తండ్రికి కృతజ్ఞత చూపవలయు.

ఈనాడు కూడ నవరచయితలు కొందరు తాము రచించిన పిల్లల కథలు కథానికల చివర నీతిసూక్తులు చేర్చుతున్నారు.

మధుర కవి నాళం కృష్ణారావుగారు తన ముద్దుకైతల ద్వారా తెలుగు బిడ్డలకు మాతృభాష మీద మమకారం పెంచారు. దేశసేవా పరాయణతను తెలియజెప్పారు. తీయతీయని సుద్దులలో బుద్ధులునేర్పారు. స్వంత రచనలతో. కొన్ని అంగ్లానువాదాలు చేర్చి కొన్ని పద్యకావ్యాలు ప్రకటించారు. వారి కావ్యాలపేర్లు : తేనెచినుకులు, పాలతరగలు మీగడ తరకలు, వెన్నబుడగలు, గోరుముద్దలు, భోజరాజీయములోని గోవ్యాఘ్రు సంవాదం నుండి అనువదించిన గోగీతం మొదలైనవి. పుస్తకాలపేర్లు ముద్దుగా అర్థబోధకంగా ఉన్నాయి. ఈ పుస్తకాలు కొన్ని పాఠ్యగ్రంథాలుగా కూడ నిర్ణయింపబడినాయి. వీనిలోని కొన్ని ఖండికలు అనేక ఇతర పాఠ్యగ్రంథాల్లో చేర్చబడినాయి.

# 3

బాలవాఙ్మయాన్ని రెండు పాయలుగా విడదీసి చూడ వలసి ఉంది విద్యావిధానానికి సంబంధించింది ఒకపాయ. మిగిలినదంతా ఒక పాయ.

మరి కొన్నేళ్లపాటు పాఠ్యపుస్తకాలు ప్రచురణ కర్తల చేతుల్లో పడి చాలా అధ్వానంగా తయారైనాయి. వాని మీద టి. బి. సి. (Text Book

Committee) ముద్రపడితేచాలు. బడుల్లో పఠనీయగ్రంథాలై కూర్చోవడానికి. వానికితోడు కొన్ని శతకాలు. వాచకాల్లోని కొన్ని పాఠ్యభాగాలు శతకాల్లోని కొన్ని పద్యాలు పిల్లల ఆంతస్తుకి, అభిరుచికి అనుకూలం కాకపోవడమేకాక ఎంతో ఎబ్బెట్టుగా. అభ్యంతరకరంగా కూడ ఉండేవి. శతక పద్యాలు పిల్లలు విధిగా కంఠస్థంచేయవలసి ఉండేది. శతకాల విషయం కొంచెం పేర్కొంటాను

భాస్కర శతకంలో 'అంగన నమ్మరాదు' అన్నపద్యం

సుమతి శతకంలో 1. పలుదోముసేయు విడియము

2. గొల్లని సాహిత్యవిద్య కోమలి నిజమున్ :— పద్యాలు అభ్యంతరకరాలు. ఈ శతకాల్లో అనేక గొప్ప పద్యాలున్నాయి. ఒప్పుకుంటాను. ఈ శతక కర్తలు పిల్లలకోసం తాము శతకాలు వ్రాయలేదు, ఆనాలోచితంగా పరిష్కరించకుండ ఈ శతకాలను నిర్ణయించినవారిది పొరపాటు. సుమతి శతకములో మరెన్నో, అభ్యంతరకరమైన అసభ్యమైన పద్యాలున్నాయి. వాటిని పరిహరించాలి.

సరే ఈ ప్రాచీన శతకాలమాట అటుంచుదాం. కేవలం పిల్లలకోసం రచింపబడిన, కుమార, కుమారీ శతకాలు ఆధునిక పండిత మహాశయులొకరిచేత పీఠికలో తమ ప్రాశస్త్యాన్ని గురించి యోగ్యతా పత్రాలందుకొన్నవి. ఆ శతక కర్తల ఔచిత్యం దూరదృష్టి క్రింది పద్యాల వల్ల వెల్లడి అవుతుంది.

కుమార శతకం : 1. పరకాంతల నే ప్రొద్దే నెద బరికించుట కుద్దేశింపగూడ దుర్వి కుమారా!

2. తనకులాంగ .... ఆలోచనమున మంత్రియు ....

కుమారీ శతకము : 1. పదములపై జెయివేయక, మదవతి ....

2. ధనహీనుడైన, కడు దుర్జనుడైన ....

ఇలాంటి పద్యాలు, పాఠ్యభాగాలుగా నిర్ణయించిన పురాణగాథల్లోని కొన్ని శృంగార పద్యాలు—ప్రాథమిక పాఠశాలల్లోని బాలబాలికలకు ఉచితానుచితజ్ఞతను పాటించకుండ తమకు తోచిన రీతిని నీతులనుకొని బోధింపబూనటం చాల దారుణం, దగాకూడ.

కావాలంటే వేమన పద్యాలు ఎన్నో మంచివి ఉన్నాయి. నిరాక్షేపణీయంగా బోధింపవచ్చు. వేమన పద్యాలు సామాన్యులకోసం అసామాన్య పద్ధతిని చెప్పబడినాయి. ఒక్కసారి విన్నంత మాత్రాన నోటికి వచ్చే పద్యాలు, జ్ఞాపకముండే పద్యాలు అవి. తెలుగులో వేమన, అరవంలో తిరువళ్లూర్, హిందీలో కబీర్, మహారాష్ట్రంలో తుకారాం సంఘంలోని లోపాలను, క్షుద్రభావాలను అంధవిశ్వాసాలను తూర్పారబట్టారు. వారి సాహిత్య సృష్టి ఒక వర్గంకోసం కాదు. స్థూలంగా జనసామాన్యం కోసమని చెప్పవచ్చు. జీవితం గురించి ఎవరికీ దుర్భ్రమలు లేకుండానూ, మానవుడు తాను మానవుడైనందుకు గర్వపడేట్టూ, పిరికివాళ్లకుధైర్యంకలిగేటట్టూ, అసహాయులకు శక్తి వచ్చేటట్టూ చెయ్యడానికుద్దేశింప బడిన రచనలవి. వేమన పద్యాలు మూడు భాగాలుగా చేయవచ్చు. నీతిబోధకాలు, విమర్శనాత్మకాలు, గూఢ వేదాంత బోధకాలు. ఏనాడో బుద్ధిమంతులు పిల్లలకోసం వేమన నీతి పద్యాలను చక్కగా పరిష్కరించి శతకంగా కూర్చి ఉన్నారు. మచ్చుకు అందులోని కొన్ని పద్యాలు.

1. ఉర్వివారికెల్ల ఒక్కకంచముబెట్టి
పొత్తు గుడిపి, కులము పొలియజేసి,
తలనుచేయి పెట్టి, తగనమ్మ బల్కరా!
విశ్వదాభి రామ వినురవేమ!

2. ఉప్పు కప్పురంబు ఒక్కపోలికనుండు
చూడ చూడ రుచుల జాడ వేరు
పురుషులందు పుణ్యపురుషులు వేరయా—

3. మాలవానినేల మహిమీద నిందింప
ఒడలి రక్తమాంస మొకటి గాదె
వానిలోన మెలగు వాని కులంబేది?

4. మాల మాలగాదు మహిమీద నే ప్రొద్దు
మాట తిరుగువాడు మాల గాక.
వాని మాలయనెడు వాడె పో పెనుమాల—

5. భూమి నాదియన్న భూమి పక్కున నవ్వు.
దానహీను జూచి ధనము నవ్వు.
కదన భీతుజూచి—కాలుండు నవ్వురా—

6. హింస సేయకుంట సంసారి ధర్మంబు
జంతువులను జంపి పాపడుదురె ?
తనదు బిడ్డ జంప దాగిచ్చగించునా ?

పాఠ్యగ్రంథాలు ప్రభుత్వం చేపట్టిన తర్వాత పాతలోపాలు పరిహరింప బడినా కొత్తవి కొన్ని తలసూపాయి. ఉదాహరణకు చిన్న పిల్లల వాచకాల్లోని గోదాదేవి జన్మవృత్తాంతం, భరతుని జన్మవృత్తాంతం వంటివి. శ్రీనాథుని పల్లకి గాలిలో తేలి యుండడం, పోతన నాగలి ఎద్దులు లేకుండా దున్నకు పోవడం వంటివి. ఆలోచనాపరులైన బాలలకివి అభూత కల్పనలుగానే, అవాస్తవి కంగానే తట్టుతాయి. కావాలంటే పిల్లలకు ప్రత్యేకంగా కల్పనా కథలు, అద్భుత కథలు (Fairy Tales), పంచతంత్ర కథలు వంటివి ఎన్నో ఉన్నాయి. అక్కడ ఈ వాస్తవికత అవాస్తవి కతలు తలెత్తవు, ఇలాంటివి నిర్ణయించే టప్పుడు గొప్ప ఆలోచన కావాలి. కల్పన హేతుత్వం సమ్మిళి తంచేసి బాలసాహిత్యం సృష్టించడానికి మనకు ఎంతో యోచన, సాధన అవసరం.

# 4

ఈ విషవలయం నుండి పిల్లలకు విముక్తి కలిగించిన వారు శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు. వారు చక్కని మక్కువ గొల్పే మధురమంజులశైలిలో బాలలకై బాలలై, బాలగీతావళులు పద్యాల్లో ప్రాథమిక తరగతుల ఉపయోగార్థం 1 2. 3. 4. 5 భాగాలు రచించారు. నిజంగా వారు చిన్న పిల్లలకు ఊపిరిపోశారు. మనస్సుకు ఆరోగ్యమైన, పరిశుభ్రమైన వాతావరణం

కల్పించారు. బాలగీతావళుల్ని రచించడంలో వారి యుద్దేశ్యమేమిటో పీఠికలో వివరంగా ప్రస్తావించిన దాని సారాంశాన్ని చదువరుల ముందుంచడం ఉచితమని భావిస్తున్నాను.

పాఠ్య పుస్తకాలు పిల్లల వయః క్రమాన్ని, బుద్ధి శక్తుల్ని, అనుసరించి ఉండాలి. చిన్న బిడ్డలకు గృహ పరిసరంలో కలిగిన అనుభవ జ్ఞానాన్ని చక్కగా వికసింప జేయడానికి అవి సహాయభూతం కావాలి. వారికి తెలిసిన విషయాల నుండి తెలియని విషయాలు బోధించాలి. పాఠాలు బిడ్డలకు ఉత్సాహం, ఆసక్తి, జ్ఞానాభివృద్ధి కలిగించేవిగా ఉండాలి. చలం అన్నట్లు ఆనందం అభివృద్ధి కలిగించని చదువు విషతుల్యం; ప్రకృతివిరుద్ధాలైన విషయాలు కాని, ఊహకందని భావాలు కాని ఆలేత బుర్రల్లో బలవతంగా ప్రవేశ పెట్టరాదు. భావమేకాక భాషకూడ వారికి సులువుగా ఉండాలి. నోట పట్టేవిగా ఉండాలి. పాలు తాగే పిల్లలకు ఆహారంలో కలిపి, సవరుచులూ నెమ్మదిగా క్రమంగా అలవాటుచేసినట్లు భిన్న భిన్నవిషయాలు భావాలు వాళ్లకి యధోచితంగా బోధించాలి. సక్రమ వికాసం సంపూర్ణ వికాసం కలిగించాలి.

పిల్లలకు విషయ పరిజ్ఞానం కలిగించేందుకు భావ వికసనం కూర్చేందుకు మేధాశక్తిని పెంచేందుకు వచనం కంటె పద్యమే అనుకూలం. ప్రస్తుత పాఠ్య గ్రంథాల్లో పద్యాలకు, వచన పాఠాలకు ఏ మాత్రం అంతనా పొంతనా ఉండడంలేదు. ధారణకు పద్యాలుఉపయోగపడతా యన్నమాట తప్ప అన్యం ఆలోచించడంలేదు. ఎవరో ఎప్పుడో ఎందుకో రాసిన పద్యాలను గుడ్డిగా నిర్ణయిస్తున్నారు.

విషయ పరిజ్ఞానం కూర్చడం ఒకటి, భావపరిజ్ఞానం వల్ల మేధాశక్తిని పెంచడం వేరొకటి అన్న సత్యాన్నే పాఠ్య గ్రంథ నిర్మాతలు, నిర్ణేతలు మరచి పోతున్నారు. ఆ రెండింటి సమన్వయం వచన పద్య భాగాల సమన్వయంతో ముడిపడి ఉంటుంది.

పిల్లలకు కొన్ని గుణాలు శక్తులు సహజంగా ఉంటాయి. వాళ్ళ పంచేంద్రియాలు చాల చురుగ్గా పని చేస్తాయి. మాటలు పూర్తిగా నేర్వక పూర్వమే

వాళ్ళలోని సహజ లయస్పందనం ఉత్సాహావేశంవల్ల వాళ్ళనోటినుండి అవ్యక్తంగా అప్రయత్నంగా కవిత్వం వెలువడుతుంది. ఉద్రిక్త భావ వ్యక్తీకరణకు లయాత్మకమైన శబ్ద విన్యాసం తోడ్పడుతుంది. అందువల్లనే పిల్లలు తొలిదశలో పాటలకు మక్కువ పడతారు. ఒక ఆంగ్ల కవి అన్నట్లు 'పిల్లలే చక్కని పాటలు.' గణబద్ధమైన పదాల కూర్పులో గానముంది. ఆ గానంలో ఆనందముంది. ఆ యానందం పిల్లల కవసరమైయుంది. ఈ గానామృతం పిల్లలు తల్లిపాడే జోల పాటల నుండే గ్రోలుతున్నారు. అమ్మగోరు ముద్దలు, గుజ్జు ముద్దలు తినిపిస్తూ "చందమామ రావే! జాబిల్లి రావే!" అని పాడే పాటల నుండీ పొందుతున్నారు.

పిల్లల అభినవోత్సాహ వల్లికను కొనసాగేలాగ చేయడానికి, వాళ్ళ కోమల హృదయ కోరకాన్ని వికసింపజేయడానికి, అందుండి అవ్యక్త భావ పరిమళాన్ని గుబాళింపజేయడానికి తోడ్పడే విధంగా పుస్తకాలూ బోధనా ఉండాలి.

తరువాత స్వర్గీయులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి, గిడుగు వేంకట సీతాపతి గారల అనల్పమైన బాల వాఙ్మయ సేవను గురించి తెలుసుకోవడం ధర్మం.

శ్రీ శాస్త్రిగారి చిరకాల భాషా పరిశ్రమకు, అనేక మధుర కవితల సేకరణకు చిహ్నంగా నిలిచి ఉండేది వారి "బాలభాష" అన్న గ్రంథం అందులో వారు ఆంధ్రదేశంలో బాల బాలికలు ఆడే ఆటలు, పాడే పాటలు, పలికే పలుకులు, చెప్పుకొనే కథలు కొన్నింటిని చేర్చారు. 1930 లోనే భారతి పత్రికలో శ్రీవారు 'బాలభాష' అన్న ఒక వ్యాసం కూడా రాశారు. బాల పత్రికలో, ఆనంద వాణి పత్రికలో పిల్లలకై గేయాలు, నీతులు, కథలు, చాల రాశారు. వారి పిల్లల పాట—

బొంగరం బొంగరం గంగరావి బొంగరం–
తాడులేని బొంగరం–తాత చేసిన బొంగరం
చిన్నారి బొంగరం–చిటికకు తిరిగే బొంగరం
ముల్లులేని బొంగరం–పిల్లలాడు బొంగరం"

ఒక పద్యం—గీ॥ ఆంధ్ర భాష అమృత మాంధ్రాక్షరములు
ముద్దు లొలుకు గుండ్ర ముత్తియములు
ఆంధ్రదేశ మాయురారోగ్య వర్ధక
మాంధ్రజాతి నీతి ననుసరించు :

శ్రీ వేంకట సీతాపతి గారు ఆధునిక బాల సాహిత్యంలో తొలి రచనల నబడే గేయాలను 1907 లోనే రచించారు. 'రైలు బండి' 'చిలకమ్మ పెండ్లి' మొదలైన గేయాలవి. 1948 లో బాల సాహిత్యము తొలిపూతగా 'బాలానందం' పేరుతో చిన్న చిన్న పాటలు కథలు చేర్చి ఒక గ్రంథంగా ప్రకటించారు. ఈ గ్రంథానికి తెలుగు భాషా సమితి వారు 500 రూపాయలు పారితోషిక మిచ్చారు.

కథలు నీతులు సుద్దులు పిల్లల కందించడానికి సీతాపతి గారు చేసిన హెచ్చరిక—

1. ఎచ్చరికలతో ఉఊ అంటూ
ముచ్చటపడి వినవచ్చే పిల్లలు
మెచ్చే కథలను తేలిక మాటల
స్వేచ్ఛగ చెప్పండీ, ముచ్చట లాడండీ....

2. పిల్లల చెవులకు ఇంపగు పలుకులు
పిల్లల మదిలో నిలిచే నీతులు
పిల్లలకోసము పిట్ట కథలుగా
పెద్దలు చెప్పండీ. సుద్దులు పలకండీ....

ఆంధ్ర ప్రభుత్వం వారు కొంతకాలంపాటు నిర్వహించిన బాలరచనా శిక్షణ తరగతుల (Literary Work Shop).కు శ్రీ సీతాపతిగారు ఆచార్యులుగా నియమింపబడినారు. 1956 మొదటి జట్టులో శ్రీవారి ఆచార్యత్వంలో రాజ మహేంద్రవరంలో నేను బాల రచనా శిక్షణ పొందాను. ఆ సమయంలో శ్రీవారికి గల అపార పాండిత్యం, శిక్షణానుభవం, రచనా శిల్ప ప్రావీణ్యం, ఛందో రీతుల వైశిష్ట్యం, ఆంగ్ల భాషా వైదుష్యం అన్నీ మాకు అవగతమై నాయి. శ్రీ సీతాపతి గారి పరిశోధనా కృషి బహుధా ప్రశంసనీయం.

# 5

ఇతర దేశాలతో, ఇంతెందుకు, ఇతర రాష్ట్రాలతో పోల్చి చూసుకుంటే పిల్లల పత్రికలు నిర్వహించడంలో మనం ఎంతో వెనకబడి ఉన్నామనే చెప్పు కోవాలి. జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్‌లో పిల్లలు బడులలో చదివే పాఠాలతో పాటు రకరకాల పనులు నేర్చుకుంటారు. అందులో ముద్రణ ఒకటి. అక్కడ పిల్లల ముద్రణాలయాలు 150 వరకున్నాయి పిల్లలు తమ పత్రికలను తామే నడుపుకుంటారు. పత్రికలు, క్యాలెండరులు పుస్తకాలు, తమకు సంబంధించి నవి స్వయంగా ముద్రించుకుంటారు. రచనలన్నీ తామే రచించుకుంటారు. కావలసిన చిత్రాలు తామే చిత్రించుకుంటారు.

తెలుగులో వెలువడిన కొన్ని పిల్లల పత్రికలు—

1. బాల (1945) 2. చందమామ (1946) 3. బాలబంధు 4. పాపాయి 5. బాబు 6. బాలమిత్ర 7. బొట్టిబావ 8. గుజ్జనగూళ్లు 9 బొమ్మరిల్లు 10. పాలవెల్లి 11. కోకిల 12. బాలానందం (మాస పత్రిక) 13. బాలానందం (పక్ష పత్రిక) 14. బాలప్రభ 15. బాల వినోదము 16. ఆనంద బాల 17. హరివిల్లు.

ఇందులో చాల పత్రికలు కారణాంతరాల వల్ల ఆగిపోయాయి. కొద్ది పత్రికలు మాత్రం వెలువడుతున్నాయి.

సాహిత్య ప్రచారానికి గొప్ప సాధనాలు పత్రికలు. కొన్ని పట్ల సాహిత్య సృష్టికి కూడ ప్రేరకాలు. బాలల రచనాసక్తి, పఠనాసక్తి, భాషానురక్తి, జ్ఞాపక శక్తి, భావాభివృద్ధికి పత్రికలు ఎంతగానో దోహదం చేస్తాయి.

1945 లో 'బాల' పిల్లల పత్రిగా మొదట అవతరించింది. దానిని నిర్వహించిన వారు శ్రీ న్యాయపతి దంపతులు — శ్రీ రాఘవరావు శ్రీమతి కామేశ్వరిగారలు. పది సంవత్సరాలకు పైగా 'బాల' గొప్ప దక్షతతో ఆదర్శాలతో నిర్వహింపబడింది. అందులో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి, శ్రీ వేలూరి శివరామ శాస్త్రి గారల వంటి ఉద్దండ పండితులు కూడ కథలు, గేయాలు, పద్యాలు,

సీతులు, ఎన్నో ప్రకటించేవారు. తొలి బాలసంచికలోని ఒక చక్కని బాల గేయం నా కిప్పటికీ జ్ఞాపకం ఉంది.

అనగా అనగా కోతి
కోతికి కలదూ మూతి
మూతికి కలదూ ముక్కు
ముక్కూ ముక్కూ టిక్కు
డీ డీ డీ డీ డిక్కు.—అన్నది.

కథలు, చిత్రకథలు, రూపకాలు, గేయాలు వినోద విజ్ఞాన విషయాలు ఎన్నెన్నో ప్రవేశపెట్టిన గౌరవం బాలపత్రిక గడించుకొన్నది.

పిల్లల పత్రికా ప్రపంచంలో అద్భుత సంచలనాన్ని కలిగిస్తూ అనేక భాషల్లో చిత్ర చిత్ర వర్ణ చిత్రాలతో వెలువడుతున్న 'చందమామ'ది ఒక ప్రత్యేక స్థానం. ఆ స్థాయికి మరో పత్రిక చేరలేదు. అయితే ఆ పత్రికను పిల్లలకంటే పెద్దలే ఎగబడి చదువుతున్నారన్నది ఆసక్తికర విషయం.

శ్రీ పాటిబండ మాధవశర్మగారు విజయవాడనుండి కొన్నేళ్లకు పూర్వం 'బాలప్రభ' అన్న వార పత్రికను ఎన్నో ఆశయాలతో నిర్వహించారు. అది బాలప్రపంచ వార్తాపత్రికగా వెలుగొందింది అలాంటి పత్రిక నడిచే దశ మన కింకా కలగకపోవడం చేత అది ఆగిపోయింది.

ప్రాచీన బాలవాఙ్మయానికి ప్రచారావకాశ మిచ్చిన కొన్ని పత్రికలు ఆధునిక బాలగేయాలకూ చోటిచ్చాయి. కృష్ణా పత్రిక ఆదివారం ఆదివారం బాలగేయాలు ప్రకటించేది. నా తొలి బాలగేయాలు అందులోనే ప్రకటింప బడేవి. విద్యా సంబంధమైన ప్రారంభ విద్యలోనూ నా బాలగేయాలు చాలా ప్రకటింపబడినాయి.

ఆంధ్ర పత్రిక, ప్రభ, జ్యోతి వార పత్రికల్లో బాల శీర్షికలున్నాయి. చినచిన్న కథలు, గేయాలు విజ్ఞాన విషయాలు కూడ ప్రకటింపబడుతున్నాయి. కొన్నేళ్ల క్రిందట ఆంధ్ర పత్రిక ఇతర భాషలనుండి బాలల నవలలు

అనువదించి తెలుగు బాలల కందించింది ఆంగ్లంనుండి 'టామ్‌సాయర్' మున్నగు నవలలు శ్రీ నండూరి రామమోహనరావు అనువదించి ఆ పత్రిక ద్వారా అందించారు. విశాలాంధ్ర దినపత్రిక ఆదివారాల్లో 'చిన్నారి లోకం' శీర్షికక్రింద బాల సాహిత్యానికి ప్రచారమిచ్చింది. ఆ శీర్షిక ప్రారంభం నా బాలగేయాలతోనే జరిగింది. తెలుగునాట ఒక సంచలనాన్ని కలిగించింది.

అందులో ప్రచురితమైన నా బాలగేయం

ప్రశ్నలు—

లక్ష ప్రశ్నలు : యక్ష ప్రశ్నలు
చిట్టి ప్రశ్నలు గట్టి ప్రశ్నలు
చిన్ని ప్రశ్నలు ఎన్నతగినవి
చిట్టి చిన్నీ కలిసి తాతను
పట్టుకొని పలుప్రశ్నలడిగిరి
లక్ష ప్రశ్నలు : యక్ష ప్రశ్నలు.

1. పిట్టలెందుకు మాటలాడవు ?
చెట్లులెందుకు మసలనేరవు ?

2. నీటిలోపల తిరుగు చేపలు
నేలపై తిరుగాడ వెందుకు ?

3. సూర్యుడెందుకు వేడినిచ్చును ?
చంద్రుడెందుకు చలువనిచ్చును ?

4. అగ్నినార్పెడు నీరమేతా
నగ్నిచే హరియింప బడునెటు ?

5. కారుచీకటి గానబడనిది
కాంతివెలుగున గానబడునెటు ?

6. గాలి ఎందుకు వీచుచుండును ?
పూలకెందుకు రంగులుండును ?

7. ఎందుకుండురు కొందరెరుపుగ
కొందరేమో నలుపుగాను ?

8. ఎందుచేతను వాడుచుందురు
అందరూ కుడిచేతి నెక్కువ ?

9. ఆకలందరికుండు నెందుకు ?
అన్నమందరికుండ దెందుకు?

తరువాత వారం వారం ఇందులోని ఒక్కొక్క ప్రశ్నకు పిల్లల కర్థమయ్యేటట్లు సమాధానం వివరంగా రాసి ప్రచురించేవారు. ఇలా ఆ పత్రిక బాలలకు విజ్ఞాన బోధనావకాశాన్ని కూడా కల్పించింది.

ప్రారంభకులేగాక చేయి తిరిగిన బాల సాహితీ స్రష్టలున్నూ వివిధ ప్రక్రియల్లో బాల సాహిత్యాన్ని నేడు పత్రికల ద్వారా అందిస్తున్నారు.

పిల్లల పత్రికలు ఆకర్షణీయంగా ఉండాలంటే వర్ణ చిత్రాలు, రేఖా చిత్రాలు, హాస్య (కార్టూన్) చిత్రాలు, కథాచిత్రాలు అందులో ఉండాలి. ఇట్టి చిత్రాలు రచించడంలో సిద్ధహస్తులు స్వర్గీయ విశ్వాత్ముల నరసింహ మూర్తి, శ్రీ వడ్డాది పాపయ్య, బాపు, బుజ్జాయ్, సత్యమూర్తి, ఈశ్వర్, గోలి శివరామ్, శంకర్, సంజీవి, చంద్ర మొదలైనవారు. ఈ కళా స్రష్టల సహకారంలేందే పిల్లల పత్రికలు నిర్వహించడం కష్టం. ఒక సమగ్రమైన సర్వాంగ సుందరమైన పిల్లల పత్రిక ఆదర్శ మార్గాన నడపాలంటే ప్రభుత్వం యొక్క ప్రోత్సాహం, అండదండలు ఉండాలి. ఆ శుభదినం ఎప్పుడో!

ప్రచార సాధనంగా పత్రికలతో సమానమైంది లేదా అంతకంటే ఎక్కువైంది రేడియో. బాల సాహిత్యం అనేక కార్యక్రమాల రూపంలో ఆకాశవాణి ద్వారా ప్రసారమౌతోంది. బొమ్మరిల్లు కార్యక్రమాలు, పాలవెల్లి కార్యక్రమాలు, బాలకవి సమ్మేళనలు, బాలల దినోత్సవాలు, జాతీయ పర్వదినాలు, ఇలాగ అందులో పాటలు, పద్యాలు, శ్లోకాలు, నాటికలు, కథలు, బుర్రకథలు, ప్రహసనాలు ఎన్నో రకాలుగా ప్రసారమౌతున్నాయి.

మొట్ట మొదట మద్రాసు రేడియో కేంద్రంలో పిల్లల కార్యక్రమాలు ప్రవేశపెట్టారు. ఆ కార్యక్రమాలు శ్రీమతి దుర్గాబాయమ్మ గారు నిర్వహించే వారు. 1940లో అలాంటి పిల్లల కార్యక్రమంలో పాల్గొనే సదవకాశం నాకూ కలిగింది. తరువాత న్యాయపతి రాఘవరావు, కామేశ్వరి గారలు ఆ బాధ్యతను చేపట్టి రేడియో అన్నయ్య అక్కయ్యగా స్థిరపడ్డారు. రేడియో ఉద్యోగంనుండి విరమించుకున్నా వారికా పేర్లు శాశ్వతమైనాయి. అటు రేడియో ద్వారాను ఇటు బాల పత్రిక ద్వారాను ఆదంపతులు బాల సాహిత్యానికి ఎనలేని సేవచేశారు. వారు కేవలం కార్యదక్షత గలవారేకాక నాటికలు, సంభాషణలు, ప్రహసనాలు, కథలు, గేయాలు, గేయకథలు ఎన్నెన్నో బాలలకోసం సృష్టించిన రచయితలు కూడ వారి సామర్థ్యానికి కీర్తి పతాకనెత్తింది. 1952లో మద్రాసులో, 1954లో కర్నూలులో, 1956 లో గుంటూరులో 1957 లో హైదరాబాదులో వారు నిర్వహించిన తెలుగు బాల మహాసభలు, 1974 అక్టోబరు 23 నుండి 26 వరకు నాలుగు రోజులు బాలానంద సంఘం సహకారంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ అధ్వర్యంలో కొనసాగిన అఖిల భారత తెలుగు బాలల మహోత్సవమున్నూ. ఈ సందర్భాన వారొక చక్కని బాల వాఙ్మయ వివేచనతో కూడిన సంచికను కూడ వెలువరించారు. 1852 లో మద్రాసులో జరిగిన బాల మహాసభలో. 1974లో హైదరాబాదులో జరిగిన అఖిల భారత తెలుగు బాలల మహోత్సవంలో నేను పాల్గొనే అవకాశాన్ని కలిగించింది శ్రీన్యాయపతి దంపతులే. వారికి నేనెంతైనా కృతజ్ఞుణి.

ప్రస్తుతం విజయవాడ ఆలిండియా రేడియోస్టేషన్ డైరెక్టర్ గారైన శ్రీబాలాంత్రపు రజనీ కాంతరావు గారు ఖ్యాతిగన్న గేయకవులు, గాయకులున్నూ. వారు బాల సాహిత్య ప్రక్రియలెన్నో నవనవోన్మేషంగా నిర్వహిస్తున్నారు. బాల సాహిత్యానికి కొత్త రూపం ఊపిరి ప్రసాదించిన శ్రీవెంకట పార్వతీశ్వర కవులలో ఒకరైన శ్రీ వెంకటరావుగారి పుత్రులు. అన్నిటా తండ్రికి తగిన తనయులు. చిన్ననాట నుండి సంగీత సాహిత్యాలలో పెరిగిన వారు. భాషలో భావంలో గానంలో మెలకువలెరిగిన వారు. బాల మనస్తత్వం, లోక తత్వం బాగా తెలిసినవారు. వారు బాలసాహిత్యానికి చేస్తున్న సేవ అపారం. వారి అఖండ ప్రతిభను వేనోళ్ల చాటే ఒక రచన

" మూల స్తంబాలు " అనే నృత్య సంగీత నాటిక. ఈ మధ్య అది ప్రదర్శింపబడింది ఆకాశవాణిలో ప్రసారం చేయబడింది. గొప్ప మన్ననలందు కొన్నది. అందులోని ముఖ్య ఘట్టాలు కొన్ని అందిస్తాను. —

" పౌర జీవితారంభాలు
రేపటి మూల స్తంభాలు
పిల్లలు నేడై పౌరులు రేపౌ
సంఘపు మూల స్తంబాలు " — పిల్లలు.

ప్రాచీన క్రొత్తల మధ్య సంఘర్షణ ప్రారంభం —

పంతులు :— శాశ్వతమై సత్యమై ఈ
విశ్వ గతికే మూలమై
ఈశ్వరుండని జ్ఞానులెరిగిన
ఏక శక్తికి వందనం.

అని ప్రార్థనా బోధ శిష్యులకు చేస్తాడు. అభినవకుమార్ అన్న విద్యార్థి ప్రార్థనకు దూరమైన దృష్టి కలిగి ఇలా ప్రశ్నిస్తాడు. అభినవకుమార్ :—

పంతులుగారూ ! మీకిదిగోను సలాము
వద్దు వద్దు మా బుద్ధికిలాటి మలాము
ఎరుగని ఈశ్వరుడెవరో ఏలా నమ్మడం ?
పెరుగుతున్న విజ్ఞానం ఎలా మరవడం ?

పంతులు :— తరతరాల సత్యాన్వేషణ గమ్యము
పెరిగే విజ్ఞాన పరులకెల్ల మాన్యము
దైవభక్తి గురుభక్తుల కలదు సామ్యము
వినయ వివేచనలులేని విద్య శూన్యము.

అభినవ :—పంతులు గారూ మీకిది గోను సలాము
వద్దు వద్దు మాబుద్ధి కిలాటి మలాము
ప్రశ్నించే తర్క-బుద్ధి ప్రగతి ధర్మము
విద్యార్థుల విజ్ఞానమ్మెరుగు మర్మము

అసలు చిక్కు ఇలా ఉంది —

పాత పడక వీడదు ఆ గురు జనబోధ
కొత్త పరుగులెత్తును యువనాయక బోధ

అల్లరికీ మరి అరాచకానికి
కల్ల చదువులకు కపటముకూ
పిల్లలదే ఒక పేరాయే, బడి
పిల్లలదే ఒక పేరాయే.

ఓరిమికీ మరి కూరిమికీ
ఓపలేని పేదతనముకూ
ఎదుగూ బొదుగూ లేని జీవితం
జీతగాండ్రిలో కనిష్ట జీతం
ఊరి పెద్దలకు ఉద్యోగాలకూ
ఒదిగి ఒదిగి మసిలే దుర్గతి
పంతులుదే ఒకపేరాయే, బడి
పంతులుదే ఒక పేరాయే.

ఈ నాడు కుడి ఎడమల గోల వల్ల అంతా అరాచకం అస్తవ్యస్తం.

ఎటువైపు ఈ నాడు ప్రసరించునో
పంతులు చూపు
అటువైపె అటువైపె పయనింతురు
పిల్లలు రేపు — నిజమే కదా !

చివరికి కాన్వొకేషన్ (Convocation)

కుడి ఎడమల కాన్వొకేషన్ దుస్తులు ధరించి పట్టభద్రులు బారులు తీరి బలాబలాలు (Tug of War)గా నిలబడతారు. వాదించు కుంటారు తామంటే తాము గొప్పని.

చివరికి ప్రిన్సిపాల్ తీర్పరిగా మధ్య నిలబడి స్నాతకోపన్యాసం చేస్తాడు ఇలా—

"ఓటు హక్కు లభియించే వరకూ
చదువులు నేర్చే విద్యార్థులకు
కుడి ఎడమలతో కూడదు జోక్యం
క్రమ శిక్షణతో చదువే ముఖ్యం."

గ్రహించిన విద్యార్థి బృందం—"ఇదియే భరతవాక్యం" అంటారు
ప్రిన్సిపాల్—"విద్యాలయ సరిహద్దుల నడుమ
విద్యలు గరపే ఒజ్జలకెల్లా
సర్వసమ్మతాంశములే పాఠం
శీలవంతమౌ నడతయె ముఖ్యం"

"ఇదియే భరతవాక్యం" అంటారు విద్యార్థి బృంద అంతా నేటికి ఎంతో చక్కగా సరిపడిన నాటిక—

నృత్య సంగీతనాటిక ఇది.

ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రంలో ప్రస్తుతం పిల్లల కార్యక్రమాలు నిర్వహిస్తున్న శ్రీ రావూరి భరద్వాజగారు పేరెన్నికగన్న రచయిత. చిన్న పిల్లల విజ్ఞాన వికాసానికి దోహదం చేసే ఒక ప్రత్యేక విషయాన్ని చేపట్టారు. శ్రీ వసంతరావు వేంకటరావుగారున్నూ ఈ విషయంలో కృషిచేస్తున్న వారే, అయినా శ్రీ భరద్వాజగారిదే ప్రథమ తాంబూలం. అదేమంటే సుగమ విజ్ఞాన శాస్త్ర గ్రంథ రచన. మన చుట్టూఉంటే శతకోటి వస్తువుల ఆనుపానులన్నీ అందంగా—పెన్సిల్‌నుండి పెన్సిలిన్‌దాకా, నాచునుండి నక్షత్ర ప్రపంచందాకా పిల్లలకు సులభంగా కథాకథన పద్ధతిలో చవులూరేలాగా అనేక గ్రంథాలువ్రాసి అఖిలాంధ్ర ప్రజ మన్నన లందుకొన్నారు. వీరి గ్రంథాలు 'విచిత్ర ప్రపంచం', 'తెలుసుకొందాం' 'ద్రవ్య ప్రపంచం' 'వినువీధిలో వింతలు' మొదలైనవి. పుస్తకాలపేర్లుపిల్లల కుతూహలాన్ని రేకెత్తించేలాగ ఉన్నాయి. వాళ్లకు చిన్ననాటనుండి హేతువాదం శాస్త్రవిజ్ఞానంతో కూడియున్న దృష్టి తప్పక అవసరమన్న సత్యం ఎఱిగిన వీరి సాహిత్యసేవ ఎంతో మెచ్చుకోతగింది.

ఆకాశవాణిలో కొన్నేళ్ళు పిల్లల కార్యక్రమాలు నిర్వహించి ఉద్యోగ విరమణచేసిన శ్రీ ఏడిద కామేశ్వరరావుగారు పిల్లలకోసం రకరకాల పాటలు రాశారు 'బాల భారతి' పేరుతో ఒకగేయ సంపుటాన్ని ప్రకటించారు.

సినిమా రంగంలో కూడ పిల్లల సాహిత్యానికి చోటు లభించింది. ఈనాడు బాలలులేని చలనచిత్రం లేదనే చెప్పవచ్చు తెలుగులో 'బాలానందం' పూర్తి బాలల చలనచిత్రం. చేయి తిరిగిన ప్రఖ్యాత కవులు శ్రీ కృష్ణశాస్త్రి, దాశరథి, నారాయణరెడ్డి, ఆచార్య ఆత్రేయ తదితరులు ఎందరో మంచి మంచి బాలగేయాలు చలనచిత్ర రంగంలో అందిస్తున్నారు. ప్రజలు విని ఆనందిస్తు న్నారు.

బాల సాహిత్య వికసనానికీ ప్రచారానికీ పల్లెపల్లెలా ప్రారంభింపబడిన బాల సంఘాలు, మహిళా సంఘాలు కూడ సహాయపడ్డాయి బాల సంఘాల్లో పిల్లల కాసక్తి జనకాలైన చిత్ర చిత్ర కార్యక్రమాలు పిల్లల్లో ఉత్సాహం ధైర్యం, భాషాభిరుచి, కళాభిరుచి పెంపొందేవి ఉంటున్నవి. ఈ సంఘాలు ప్రభుత్వం నుండి ధన సహాయాన్ని (గ్రాంటు) పొందాయి. సర్కారుజిల్లా అయిన గుంటూరులోని బాలానందం మంచిపని చేస్తోంది. దానిక్రింద ఐదు అనుబంధ బాలానంద శాఖలున్నాయి. ఐదు ప్రాథమిక పాఠశాలలు పని చేస్తున్నాయి. ఒక పత్రిక నడుపబడుతోంది. హైదరాబాదులోని జవహర్ బాలభవన్ బాలల మానసిక వికాసానికి తోడ్పడే ఎన్నో కార్యక్రమాలు చేప ట్టింది. గ్రంథాలయం, మట్టిపని, కుట్టుపని, వడ్రంగం, రకరకాల ఆటలు, ఫోటోగ్రఫీ, సంగీతం — ఒకటేమిటి బాలలకవసరమైన అన్ని విషయాలతో విరాజిల్లుతున్న గొప్ప బాల కేంద్రం అది.

మహిళా మండలులలో బాలల వికాసానికి అవకాశమున్నది. బాల సంఘాలు వాటికి అనుబంధ శాఖలుగా ఉంటున్నవి. గుడివాడ మహిళా మండలి ఒక బాలల పాఠశాలను నడుపుతున్నది.

ఈ భిన్న భిన్నసంస్థలు పిల్లల సాహిత్యానికి యథోచితమైన సహ కారాన్ని అందిస్తున్నవి.

# 6

గతం లేంది ప్రస్తుతంలేదు. గతంలో మన పెద్దలు గడించి పెట్టిన జ్ఞాన విజ్ఞానాలు, సాహిత్య సంపదలు ప్రస్తుత కాలంలో మనకి పనికి వచ్చేవే. ఆపునాదిపై నే మన ఈ నాటి సాహిత్యసౌధ నిర్మాణం కొనసాగుతుంది ప్రాచీన వాఙ్మయంలోని విషయాలు మనకు వెలుగు బలం చేకూర్చుతాయి. నాడు శాస్త్ర విజ్ఞానం నేడున్నంత విరివిగా ఉండి ఉండక పోవచ్చు. కాని నాటి ప్రజల్లోని జిజ్ఞాస పరిశోధన తృష్ణల పర్యవసానమేకదా, ఫలితమే కదా నేటి మన శాస్త్ర పరిజ్ఞాన వ్యాప్తి.

ప్రాచీనమైన దంతా మంచిదే; పరిగ్రహింప తగిందే— అని నమ్మ నవసరం లేదు. నాగరికత అంటే వెనుకటి వాటిని విస్మరించడంగాని ఉపేక్షించడంగాని కాదు. అలాచేస్తే అదీ ఒక అనాగరిక లక్షణం క్రిందకే వస్తుంది. ప్రాచీన విషయాలను యధాతథంగా పరిశీలించి మంచిదన్నది ఎంచుకొని పరిరక్షించు కోవడం ఎంతైన తెలివైన పని.

ఆంధ్ర జాతి ఆత్మరూప సంపద అవిచ్ఛిన్నంగా వృద్ధి చెందడానికి జనసామాన్యంలో నేటికీ నిలచియున్న అలేఖ్య పారంపర్యవాఙ్మయం (Un Written Folk Lore) నశించకుండా జాగ్రత్త పడడం మన అందరి విధి.

జాతీయ సంపద అనదగిన ఈ వాఙ్మయం మీద మనకు ఉండవలసినంత ఆదరణ అభిమానం లేదనే చెప్పాలి. ఇప్పటి వరకు మనం సేకరించి పదిల పర్చు కొన్నది చాల తక్కువే. పల్లె పల్లెల్లో మూల మూల లందున్న ఈ యమూల్యసాహిత్య సంభారాన్ని శ్రద్ధ వహించి పద్ధతి ప్రకారం సేకరించాలి. అది కాలగర్భంలో కలిసి పోక ముందే మేల్కొనాలి. ఈపని ఏ ఒక్క వ్యక్తి వల్లా సంఘం వల్లా జరిగేదికాదు. ప్రభుత్వం పూనుకోవాలి. పదిమందినీ సంఘటిత పరచి సన్నద్ధంచేయాలి. తగిన ప్రోత్సాహం వారి కీయాలి. గ్రామ గ్రామాలు తిరిగి అన్ని రకాల ప్రజను కలుసుకొని వారి దగ్గర లభ్యమయ్యే వాఙ్మయాన్ని సంపాదించాలి. ఆ సంపాదించిన దానినొక కుప్పగా పోసి, జల్లెడపట్టి ఏభాగానికాభాగం వింగడించి వేరు పర్చాలి. అప్పుడు దాన్ని

ప్రత్యేక సంపుటాలుగా ప్రచురించాలి దానికి టీక టిప్పికలు చేర్చాలి ఇంత వఱకు సేకరింపబడిన వాఙ్మయాన్ని కూడ ఇందులో ఏభాగంలో ఆభాగం చేర్చాలి.

ఈ విషయంలో మన మెంతో వెనకపడి ఉన్నాం. ఔత్తరాహులు, బెంగాలీలు, ప్రక్కనున్న కర్ణాటకలు ఎంతో కృషిచేసి కృత కృత్యులైనారు హిందీలో అందంగా ఆకర్షణీయంగా బొమ్మలలో పుస్తకాలు తయారౌతున్నాయి. పిల్లలకు ప్రత్యేకంగా మంచిపత్రిక లున్నాయి. కర్ణాటకులు బాలవిజ్ఞాన సర్వస్వాన్నే తయారు చేసుకోగలిగారు.

ఇంగ్లీషులో ఈవాఙ్మయం అపారం. అతిప్రాచీనమైన బాలవాఙ్మయాన్ని వారు శ్రద్ధవహించి సేకరించి సంపుటాలుగా ప్రచురించుకొన్నారు. రక రకాలైన సర్వస్వాన్ని పిల్లలకై సమకూర్చుకొన్నారు. బ్రిటన్‌లో పిల్ల ల పుస్తకాల పట్ల ఎంతో శ్రద్ధ చూపుతారు. సంవత్సరానికి $2\frac{1}{2}$ వేల కొత్త పుస్తకాలు తయారౌతాయి. పుస్తకాలన్నీ బొమ్మలతో పిల్లల నెంతగానో ఆకర్షి స్తాయి. ప్రతి గ్రంథాలయంలో పిల్లల విభాగం తప్పక ఉంటుంది. ఇప్పు డిప్పుడే మన ప్రభుత్వం గ్రంథాలయాల్లో పిల్లల విభాగాన్ని ఏర్పాటుచేస్తోంది.

రష్యాలో ఈవాఙ్మయానికి ప్రభుత్వాదరణ పుష్కలంగా ఉంది. అంద మైన అచ్చు, చిత్రాలు, మంచి కాగితంతో పుస్తకాలు లక్షలసంఖ్యలో అచ్చవుతాయి. ఆపుస్తకాలు ప్రపంచ భాషలన్నిటిలోకి అనువాద మౌతాయి. ప్రపంచంలోని ఇతర భాషలందున్న ఉత్తమ బాల గ్రంథాలను తమభాషలోనికి అనువదించు కొంటారు.

ఈ విషయంలో రష్యాకు పోటీగా నిలబడ గలిగింది అమెరికా. అది అతి సంపన్న దేశం. అక్కడ పిల్లల విద్యకు వినోదవిహారాలకు ఆరోగ్యానికి ఖర్చు, దేశం మొత్తం ఖర్చులో, పదిశాతానికి మించి ఉంటుంది-పిల్లలు ఎన్నో రాజకీయేతర కార్యక్రమాల్లో పాల్గొంటారు పాఠశాలల విషయంలో స్వచ్ఛం ద సేవకులుగా కార్యకర్తలుగా పనిచేసే ప్రజలు 20లక్షల వఱకు ఉంటారు.

పాశ్చాత్యదేశాల్లో ఒక సామెత ఉంది. అది "నీకుక్షణం తీరిక చిక్కితే నీ బిడ్డకేదైనా బోధించు. నీచేతిలో ఒక్క కాసుంటే నీబిడ్డ విద్యకై వెచ్చించు" అని. ఆసామెతను వారు అక్షరాలా పాటిస్తారు.

ఈ సందర్భంలో 1878 వ సంవత్సరంలో ఇంగ్లండులో స్థాపింపబడిన సాంప్రదాయిక విజ్ఞాన సంపాదనా సంఘం (Folk Lore Society) గురించి తెలుసుకొవడం ఆసక్తిదాయకం. ఆసంఘం దేశంలో ఎక్కడెక్కడున్న జానపదవాఙ్మయాన్ని సేకరించి తెచ్చి, తన యాజమాన్యాన నడుస్తున్న పత్యేక పత్రికలో ప్రకటించి అందరికీ ప్రచారంచేసేది ఆ ప్రకటించిన వివిధ విషయాలను తాలుకావారీగా, గ్రామంవారీగా, రకం వారీగా కేటాయించి అకారాది పట్టిక క్రింద వివరించి చూపేది. వాటిని వేరు వేరు సంపుటాలుగా ప్రకటించి జాగ్రత్తపరచింది. ఇదీ శాస్త్రీయ పద్ధతి పరిశోధన అంటే. ఇంత శ్రద్ధగా ఆ సంఘంచేసిన సేవవల్ల భాషకు, ప్రజలకు ఎంతో మేలు కలిగింది.

మన ప్రభుత్వం పూనుకుంటే మన ప్రాచీన వాఙ్మయాన్నంతా త్రవ్వి వెలికి తీసి కుప్ప పోయగలం. పరిష్కరించి సంపుటాలుగా ప్రకటించగలం. ఇంకా దేశంలో పేరుగాంచిన బాల సాహిత్య స్రష్టలచేత వివిధ ప్రక్రియల్లో విలువైన గ్రంథాలను తయారు చేయించగలం. ప్రాత క్రొత్తల మేలు కలయికతో బాలసాహిత్యానికి ఒక విశిష్ట విస్పష్టరూప మీయగలం.

# 7

భాషల తేడాయే కాని పిల్లల భావాలు ప్రపంచంలో ఏ భాషలోనైనా ఒక రీతిగానే ఉంటాయి. వివిధ భాషల్లోని శిశు గీతాలను పరిశీలిస్తే ఈ సత్యం బోధపడుతుంది. పిల్లల భావాలు సహజంగా సరళంగా సూటిగా వుంటాయి. వారిది నిర్మాయిక స్వభావం. భావాలు ఒక భాషనుండి వేరొక భాషలోకి అప్పు తెచ్చుకున్నా, అనువదించుకున్నా తప్పేమీలేదు. వీరేశలింగంగారు, అప్పారావుగారు, శ్రీశ్రీ. నేటి బాలరచయిత లందరూ నిస్సంకోచంగా ఆంగ్ల నుండి గాని, బెంగాలి నుండి గాని మరే భాష నుండి గాని భావాలు స్వీకరించారు. అనువదించారు.

శ్రీ విద్వాన్ విశ్వం ఎన్నో మన దేశ భాషల నుండి అనువదించి భారతీయ కవితా కల్పంగా వెలయించిన గ్రంథం నుండి పిల్లలకు సంబంధించి సవి కొన్ని ఉదహరిస్తాను. (1) పైకి :

రెక్కలు లేకుంటే మరి ఎక్కడి కెగురవు పక్షులు.
రెక్కలు లేకున్నా మీరెక్కడికైనా ఎగిరే
ఒక్క ఉపాయం చెపుతా : చుక్కలలో కెగురవచ్చు
చక్కని తలపులతోనే. తక్కన వెందుకు పాపా !

(గుజరాత్-గాంధిజీ)

2. ఆడిరా ఆడిరా ఆడిరా నాయనా :
అరకాళ్ళ కడుగుతా ఆడిరా నాయనా
ఆడిరా బంగారు వాడ నీమొగపై
నీడ కనుపించగా నీటితో కడుగుతా.

(కన్నడం-జానపదం)

3. ఏడ్చుబాలుని పెదవి ఎర్ర పగడపుక్రోవి
వాని కన్బొమలు వేప చిగుళ్ళ చిరుకొనలు
వాని చూపులు శివుని వాలువలె తీక్ష్ణములు.

(కన్నడం-జానపద గేయం)

4. పసి పాప తొక్కు పల్కు పసదనమ్ము నెరుగనివా
రసదృశమని మురళీరవము నాదరింతురూ-
పసిపాపల పలుకుకంటే పసిగల గీతమ్ములేదు
పసిపాపల ముద్దు కంటె పండుగ లేదూ-

(తమిళం-కురళ్)

5. మంచి వాడొక గున్నమామిడి చెట్టు
ఫలియించు పుష్పించు పరులకోసమ్మె.
ఇటునుంచి రాళ్ళు వర్షించిన గాని
ఫలములే అటునుంచి పడవేయుచుండు.

(హిందీ-తులసీదాస్)

6. ద్వేషికంటే బాణ తీక్షత కంటేను
అగ్నికంటే విషము సంతకంటే
వ్యాధికంటే మిగుల పరుష వాక్యమ్ములు
గుండె కోసి కోసి కుములజేయు.

(సంస్కృతం-సుందరపాండ్య)

7. ఒరుల గుండె నొప్పి నెరిగినవాడె
ఎవ్వరి మనస్సు నొప్పి వరచకుండు.

(తమిళం-కురళ్)

8. మానవత్వమే మాత్రమైనా ఉన్నట్టి మనిషి
కౌనా ఏజంతువునైనా సరకుట చంపుట మరి?

(పాళి-ధర్మపదం-చైనా అనువాదం)

## బహుమతులు పొందిన బాలసాహిత్య

1. లీలా సుందరి (నవల)
2. లక్క పిడతలు (గేయాలు)....చింతా దీక్షితులు.
3 బాలానందం (గేయాలు-కథలు) డాక్టర్. గిడుగు వేంకటసీతాపతి.
4. బడి-గంట (గేయాలు) న్యాయపతి రాఘవరావు.
5. తెలుగుతల్లి (విజ్ఞాన విషయాలు) మాగంటి బాపినీడు.
6. బాలవీరులు (నాటికలు) ఇల్లిందల సరస్వతీదేవి.
7. ఆకాశం (విజ్ఞానం) విస్సా అప్పారావు.
8. పక్షిపాటలు (గేయాలు) సత్తిరాజు కృష్ణారావు.
9. నృత్యబాల (నాట్యవిషయం) నటరాజు రామకృష్ణ.
10. బొమ్మరిల్లు (గేయాలు) కవిరావు.
11. పాలబడి పాటలు—బి. వి. నరసింహారావు.
12. బాల ప్రపంచం—మ-సూ-నా.

13. ముద్దు పాటలు—వేజెండ్ల సాంబశివరావు.
14. రంగు రంగుల రత్నదీపాలు
15. బాలాభిరామం (గేయాలు)....మిరియాల రామకృష్ణ.
16. ఆంధ్రుల చరిత్ర—నాయని కృష్ణకుమారి.
17. అల్లరిగోపి అద్భుత యాత్ర—వాసమూర్తి.
18 విజ్ఞానం—వెలగా వెంకటప్పయ్య.
19. చిట్టి ముత్యాలు—గంగరాజు సుశీలాదేవి.
20. రవీంద్ర కథ—కోడూరి శ్రీరామమూర్తి.
21. కస్తూరిబా కథ—కోడూరి లీలావతి.
22. మూడు మొగ్గలు—ఏ. లక్ష్మీరమణ.
23. విజ్ఞానం—కె. యస్. రెడ్డి.
24. ప్రకృతిలో వింతలు.
25. రాబిన్ సన్ క్రూసో—గిడుగు విశాలక్ష్మి.

# 8

మాకు ఆదర్శ గురుపాదులు ఈ మార్గంలో శ్రీ చింతా దీక్షితులుగారు, శ్రీ గుడిపాటి వెంకటచలంగారున్నూ. వారిద్దరూ విద్యాశాఖలో పని చేసినవారే. నేటి చదువుల తీరుతెన్నులు బాగా అర్థం చేసుకున్నవారే. పిల్లలకు జరిగే అన్యాయానికి వారెంతో ఖేదపడ్డారు. బాల సాహిత్యానికి జీవగర్ర నిండైన మాతృహృదయం. తల్లి హృదయం కలిగినవారు, పిల్లల శ్రేయస్సుకోసం పరిశ్రమించారు, పరితపించారు.

మన పూర్వ సాహిత్యంలో ప్రహ్లాదుడు, ధ్రువుడు తప్పా మరెవ్వరూ పిల్లలకు పరిచయమైన పాత్రలులేరు. ఇతర దేశాల బాలసాహిత్యంలో సంఘంలోని పిల్లలే పాత్రలు. శ్రీ చింతా దీక్షితులుగారు సంఘంలోని పిల్లలను సజీవ పాత్రలుగా తీసుకొన్నారు. కథలు నవలలు రచించారు. వారి 'లక్క పిడతలు' అన్న గేయ సంపుటి చాల ప్రసిద్ధం.

ఇంక పిల్లలను గురించి ఒక ప్రత్యేకమైన విప్లవ సృష్టిని కలిగించిన వారిలో మొదటివారు శ్రీ చలం. వారు రచించిన 'బిడ్డల శిక్షణ' ప్రతి ఆంధ్రుడూ తప్పకుండా పరిశీలనా దృష్టితో చదువదగిన దొడ్డ పుస్తకం. పిల్లలను పువ్వుల వలే, నక్షత్రాల మెత్తని కాంతివలే చూడగల దృష్టిని ఆయన ప్రబోధించారు. ఆయన శక్తిమంతమైన భావాలు ఎందరికో చైతన్యం కలిగించాయి. వారి ఆలోచనలకు పదను పెట్టాయి. టాగూరు మహాకవి గీతం ఒరవడిలో శ్రీ చలం గీతం.

ఎక్కడ బడి అనేది లేదో
ఎక్కడ పిల్లలకి ఆడుకోడమే విద్యో
ఎక్కడ బలవంత మనేది పిల్లలెరగరో
ఎక్కడ పిల్లలు పెద్దలకి అర్థమౌతారో
ఎక్కడ పెద్దలు పిల్లలైపోతారో
తండ్రీ! ఆలోకంలో నన్ను సృష్టించు.

టాగూరు కావ్యానికి కురంగేశ్వరరావు తెలుగు అనువాదమైన 'చంద్ర వంక'కు శ్రీ చలం రాసిన తొలిపలుకులు అక్షర లక్షలు! ఆధునిక బాలసాహితీ వేత్తలకే కాదు ప్రతివారికీ అవి గొప్ప హెచ్చరికలు; గురుదేవుని భావాలకు, చక్కని దర్పణాలు అవి.

"పిల్లల హృదయాలలో ఈశ్వరుడు ఏమాయ పొరలూ కప్పుకోకుండా వెలుగుతో ఉంటాడు.

కదిలే ఆకుల్ని, పాకే చీమని, పరిగెత్తే దూడని, ఎగిరే పిచికని, కళ్లిప్పి చూస్తో ఆశ్చర్యంగా మైమరచిన మనం, రాళ్లూ పువ్వులూ ఎండుటాకులూ మట్టి ముద్దలూ ఓనాడు మన కలలకి నిమిత్తమాత్రంగా ఆధారం చేసుకున్న మనము ఈనాడు బతికున్న బొమ్మలతో, డబ్బు కాయితాలతో, కనపడని కీర్తి గాలితో, ఆరిపోని ఆశామంటలతో ఆడుకుంటున్నామని తెలీని మనం, చిన్న పిల్లల ఆటల్ని చూసి అర్థంలేనివని నవ్వుతున్నాం.

పాతపడి మామూలు కావటం చేతనే ఈ లోకం ఇంత సారవిహీనంగా కనిపిస్తోంది. అందుకనే చెత్తకోల్కెల్ని కల్పించుకుని ఎండమావులవెంట పరుగెత్తే మృగాలవలె ఇట్లా రొప్పుతో బతకడం. మిణుగురు పురుగు ఓ నిమిషం కన్న మన చూపుని ఆపదు పెద్దయ్యాక ఎన్నో అగచాట్లుపడి సంపాయించిన డబ్బుతో చిచ్చుబుడ్లు కొని వెలిగిస్తేనేగాని కళ్లకి తృప్తిలేదు. ఇంతాచేసి చిన్నపాప మైమరచి మిణుకుమనే ఆ నీలం వెలుతుర్ని చూసినట్లు చూడగలరా విలవైన బాణ సంచాల రంగుల జ్వాలల్ని ?

చిన్నప్పటి ఆనంద తత్త్వం జ్ఞాపకం చేసినా తిరిగి దూరంగా కూడా యోచించుకోలేరు పెద్దలు.

చిన్నతనపు కలల్లో జీవించగలిగాడు కనకనే. చిన్నపిల్లల కళ్లతో లోకాన్ని చూడ గలిగాడు కనకనే. లోకం వెనక క్రీడించే ఈశ్వరుడు దర్శన మిచ్చాడు ఈ కవికి. ఆ ప్రత్యక్షానుభవాన్నే అమర గానం చేశాడు రవీంద్రనాథ్.

ప్రతి నిమిషం పసిపిల్లల్ని పలకరించే సౌందర్యదేవత తన మేలి ముసుగుని తొలిగించి తన నేత్రాల్లోనే అమర తత్త్వాన్ని ప్రదర్శించింది ఈ కవికి.

"పాప తిరిగే లోకంలో నక్షత్రాలు అతనితో మాట్లాడతాయి. పాపని ఉల్లాసపరచాలని ఆకాశం పిచ్చిపిచ్చి మబ్బులతో రంగుల ధనుస్సుతో అతని ముఖంకేసి వంగి చూస్తూంది".

ఆ సంగతి పాపకి తెలుసు. కవికి తెలుసు. మనకి తెలీదు. చెప్పినా తెలీదు.

మానవుణ్ని, అతని ఆకల్ని, ఆశల్ని, అవసరాల్ని ఓ పెనుభూతంచేసి, అన్ని అందాల్నీ, ఆశయాల్నీ, కలల్నీ, కవిత్వాన్నీ, హృదయాల్నీ, మృదు భావాల్నీ, ఆ మహాకాళి పీఠంముందు బలియిస్తున్న ఈ రోజుల్లో—

'పువ్వుల్ని కొయ్యవద్దు
పిల్లల్ని నలపవద్దు' అంటే వింటారా ?

'పిసికి కసిరి నలిపి కొట్టి ఏడిపిస్తేనేగాని నా ముద్దు తీరదండీ'—అని గొప్పగా చెప్పుకునే పురుషుల ముందు, 'ఈ దెయ్యం వొకటి దాపరించింది దేనికీ అడ్డుగా' అని ఈసడించుకునే తల్లులముందు— 'ఎందు కొచ్చాను ఇక్కడికి ?' అని తెల్లబోయి చూస్తోంది పాప.

కీర్తులకీ, దేశాలకీ, యంత్రాలకీ, ఉత్పత్తులకీ, రాజకీయాలకీ, మానవత్వాలకీ, మానవుణ్ణి మానవుడు అధికారంతో త్రొక్కి నడిచే ఈ కాలంలో, పిల్లల్ని భావిపౌరులుగా విజయావేశధురంధరులుగా ప్రోత్సహించి విద్యావధ్య స్థలానికి తోలే ఈ కాలంలో—

"దుమ్మని తృణీకరించి బంగారం కోసం దేవుళ్లాడడం ఇతనింకా నేర్చుకోలేదు. నీ హృదయానికి చేర్చుకుని ఇతన్ని దీవించు. ఎందుకొచ్చాడో ఏరుకుని నీ ద్వారం దగ్గిరికి వొచ్చాడు. నీ చేతిని పట్టుకుని తోవచూప మంటున్నాడు. ఏ అనుమానమూ మనసులో లేకుండా నవ్వుతో పలుకుతో నీ వెంట నడుస్తాడు. అతని విశ్వాసాన్ని నిలుపుకో."—అని దీనంగా అనే కవి అభ్యర్థన వుత్త అరణ్యరోదన మయింది.

నేటి యువ రచయిత లెందరికో పురోగామి ఆదర్శం అయిన శ్రీశ్రీ కలంనుండి 1934 లో ప్రళయప్రభంజనం హోరుతోపాటు ఒక సుమ సుందర 'శైశవగీతి' వెలువడించి. పిల్లలను శ్రీశ్రీ వలె, అంత అందంగా ఊహించి ఆత్మీయం చేసుకొన్నవారు మరొకరు లేరని చెప్పవచ్చు.

ఆ శైశవగీతి—పాపం పుణ్యం ప్రపంచ మార్గం
కష్టం సౌఖ్యం శ్లేషార్థాలూ
ఏమీ ఎరుగని పూవుల్లా రా !
అయిదా రేడుల పాపల్లారా !
మెరుపు మెరిస్తే వానకురిస్తే
ఆకసమున హరివిల్లు విరిస్తే
"అవిమాకే" అని ఆనందించే
కూనల్లారా !

గరికపచ్చ మైదానాల్లోనూ
తామరపూవుల కోనేరులలో
పంట చేలలో బొమ్మరిళ్ళలో
తండ్రి సందిటా తల్లి కౌగిటా
దేహధూళితో కచభారంతో
నోళుల వ్రేళులు పాలబుగ్గలూ
ఎక్కడచూస్తే అక్కడమీరై
విశ్వరూపమున విహరిస్తుండే
పరమాత్మలు ఓ చిరుతల్లారా!
మీదే మీదే సమస్త విశ్వం
మీరే లోకపు భాగ్య విధాతలు
మీహాసంలో మెరుగులు తీరును
వచ్చేనాళ్ళ విభాప్రభాతములు.

"బాల్యం" 'పుట్టని పాప ప్రార్థన' అనే మరి రెండు లోతైన అనువాద గీతాలను కూడా శ్రీశ్రీ రచించారు. రాశిలో తక్కువైనా వాసిలో ఎక్కువైనవే ఈ గీతాలు

# 9

ఇప్పుడు బాలసాహిత్య సృష్టి విరివిగా జరుగుతోంది. గేయాలు, గేయ కథలు, పద్యాలు, నాటికలు, నవలలు, కథలు ఎన్నో రూపాల పిల్లల కోసం రాసే వారు తయారైనారు. చిరంజీవి, కె. సభా, కవిరావు, అలపర్తి వేంకట సుబ్బారావు, వేజండ్ల సాంబశివరావు, మద్దులూరి రామకృష్ణ, సమతారావు, కవుల ఆంజనేయశర్మ, తాడి వెంకటకృష్ణారావు, యం. వెంకటరావు, సోమంచి రామం, మిరియాల రామకృష్ణ, చెరకుమిల్లి భాస్కరరావు, పిళ్ళా సుబ్బారావు, బాపురెడ్డి మొదలైన వారెందరో.

స్త్రీలలో కనుపర్తి వరలక్ష్మమ్మ, ఇల్లిందల సరస్వతీదేవి. చావలి బంగారమ్మ, నాయని కృష్ణకుమారి మొదలైన వారు.

శ్రీ కొనకళ్ళ, శ్రీ కందుకూరి రామభద్రారావు, డాక్టరు. శంకర శ్రీరామారావు. శ్రీ పొట్లపల్లి రామారావుగారలు కొన్ని చక్కని బాల గేయాలు వ్రాశారు.

ఇలాంటి వారు పదుల వందల సంఖ్యలోకి పెరిగారు వారందరినీ వరుసగా పేర్కొనడం సాధ్యంకాదు. ఎందరో మహానుభావులు నాకు తెలియని వారున్నారు.

గేయ రూపంలో ఉన్న ఆధునిక బాలవాఙ్మయాన్ని స్థాలీపులాకన్యాయంగా చవిచూపిస్తాను. అందులో కొన్ని నా బాలగేయాలు—

శిశు గీతాలు—1. చిన్నా! చిన్నా! బొమ్మేస్తున్నా
పూలూ పళ్ళూ చినచిన ఇళ్ళూ:
నీకో పూవు నాకో పూవు
నీకో పండు నాకో పండు
నీకో ఇల్లు నాకో ఇల్లు . . .

2. ఆటలంటే మాకిష్టం
పాట లంటే మాకిష్టం
ఆడుకుంటు పాడుకుంటు
అలా ఉండడం ఇష్టం:

(ఆంగ్లానువాదం) We like to play
We like to sing
We like to live
To play any sing.

3. పాపా ! పాపా ! నాన్నొస్తారు
పళ్లూ బిళ్ళలు కొనితెస్తారు
అల్లరి మానితె అన్నీ నీకే
అల్లరిచేస్తే అన్నీ నాకే . . .

(ఆంగ్లానువాదం) Baby baby father comes
Many many fruits and sweets he brings
Do behave, you have them all
Don't behave I have them all.

(ఒక నా ఆంగ్ల గీతం)—Little baby little baby
Will you come to school ?
Not now, not now
I will come any how.

4. సంభాషణా గీతం—

ఆవూ ! నాకు పాలిస్తా ?
అడిగిన మేతా దాణా వేస్తా ?
పాలన్నీ నే నీకే ఇస్తే,
బాబూ మరి నా లేగేడవదూ ?

ఆలాగైతే లేగకు సగమూ
అడిగిన నాకో సగమూ ఇయ్యి.
దాణా వేసిన నీకో సగమూ
తల్లిని గావున లేగకు సగమూ
పాలిస్తాను. ప్రేమిస్తాను.

5. ప్రాసప్రాధాన్యం గల గీతం—

చైనా ఒక దేశం । క్వైనా ఒక మందు.
పీటర్ ఒక రాజు । మీటర్ ఒక కొలత.
రజియా ఒక రాణి । జిజియా ఒక పన్ను.
క్యారట్ ఒక దుంప । మీరట్ ఒక పురము.
గాంధీ ఒక తాత । హిందీ ఒక భాష॥

6. అంత్యప్రాస గల గీతం—

కొండ మీద రాళ్ళు : కొండ కింద బీళ్ళు
చెట్టు మీద గూళ్ళు చెట్టు కింద వేళ్ళు
పొయ్యి మీద నీళ్ళు పొయ్యి కింద పేళ్ళు
పీట మీద కాళ్ళు పీట కింద తేళ్ళు (కోళ్ళు)
చిన్న చిన్న వాళ్ళు చెంగునెగురు లేళ్ళు.

7. అంత్యప్రాస ముక్తపద గ్రస్తం గల గీతం.

సెలఏటి దరి నొక్క చెంగల్వ బాట
బాటవెంటనె పోతె పువ్వుల తోట.
తోటలో ఒక పెద్ద దొరలుండు కోట.
కోటలో రతనాలు కూరిచిన పీట.
పీటపై రాణుల్ల ప్రియమైన ఆట.
ఆటకే కోయిలల అందాల పాట.
పాటయే పసమించు బంగారు మూట.

8. చిరు హాస్యం—

సూరయ్య మామయ్య
చూచి రావయ్య;
దారిలో బురదసుమి
జారగలవయ్య.

9. హాస్యం—

చింతచెట్టు తొర్రలోన చిలక ఉన్నది :
తాత బోడి బుర్రమీద పిలక ఉన్నది :
చిలక ముక్కు తాత ముక్కు తీరునున్నది :
చింతతొర్ర తాతబొర్ర తీరునున్నది :
తాత కాళ్ళ నున్నజోడు కిర్రుమన్నది :
చింత తొర్రలోని చిలుక తుర్రుమన్నది

10. ప్రశ్నలు:—లక్ష ప్రశ్నలు ! యక్ష ప్రశ్నలు !!

1. అద్దమున ముఖమెందు కగపడు ?
సద్దు ఎందుకు మనకు వినబడు ?

2. చుక్క లెక్కడ దాగుపగలు ?
సూర్యు డెక్కడ కేగు రేలు ?

3 ఆకసంబది నీల మెందుకు ?
అంబుధియు నీలంబు, ఎందుకు ?

4. నీరు. నూనెయు ద్రవములయ్యును
వేరు వేరుగ నుండు; కలియవె ?

5. అన్ని ప్రాణులు గాలి పీల్చితె
కొన్ని నాళ్ళకు తగ్గిపోదే ?

6. తిరుగునట్టిది భూమియైతే,
తిరుగు నట్లగపడునె సూర్యుడు ?

7. ఉప్పునీటను ఈత తేలిక
చప్పు నీటనుకంటే: ఎందుకు ?

8. చందమామకు సముద్రానికి
బంధమెట్టిదొ తెలియజెప్పుము ?

9. మెత్త మెత్తని మేఘమెట్టుల
మేటి గర్జన చేయగలుగును ?

11. పుట్టుక సమస్య—శేష ప్రశ్న :
ఎందుకు కన్నావు ? మ
మ్మెందుకు కన్నావు ?
ఇందర మిట్లా బాదర
బందీయైతే నీవు ?
చెట్టుకైనా నీడున్నది
పిట్టకైన గూడున్నది
పుట్టిన మాకేమున్నది
పుట్టకున్న పొయ్యేది.

12. అసలు సమస్య—అదోజాతి పిల్లలు :
అమ్మ నాన్న పేరెరుగని అదోజాతి పిల్లలం !
అందరివలె మేము కూడ అసలు భారతీయులం ! !
సుస్తైనా పస్తైనా మాకెప్పుడు ఒకటే :
బ్రతుకైనా చావైనా బాబు మాకు ఒకటే :
పల్లెటూళ్ళ డబ్బుదోచి బ్రతుకును పట్నాలు
పట్టణాల జేబులేమొ వెతుకును మాచేతులు :
పాడు దుమ్ము తారురోడ్లు బస్తీలో మా శయ్యలు :
కనబడితే కసరుతారు గస్తీపోలీసయ్యలు :
ఒకటంటూ మాకులేదు : ఒకరంటే భయంలేదు :
ధూళిబుట్టి ధూళిబెరిగి ధూళిగానె మారతాము :

13. అమ్మ ఒడి చదువుల బడి : మా,యమ్మ ఒడి నాకొక గుడి.।
అమ్మ నేర్పును ఒరవడి. దైవమ్ము కంటెను త్వరపడి.।

అయ చెప్పిన సుద్దులు ఆనిశమ్ము ఒప్పిన బుద్ధులు ।
అమ్మ పెదవుల హాసము నిత్యమ్ము మాకు వికాసము।
అమ్మ మంజుల భాషణం శ్రావ్యమ్ము వీనులభూషణం।
అమ్మ హృది అనురాగము దివ్యమ్ము భవ్యము యోగము।
అమ్మ చల్లనికరములు దానమ్మునకు ఆకరములు।
అమ్మ చరణతలమ్ములు క్షేమమ్ము పండు పొలమ్ములు।
అమ్మ కన్నుల కాంతులు లోకమ్మునకు సుఖశాంతులు।
అమ్మయే నా సర్వము ధైర్యమ్ము బలమూ గర్వమూ॥

# 10

పిల్లల కోసం రాయడం ఒక గొప్ప కళ. ఆ కళను సాధించడం సామాన్య విషయమనుకోరాదు. కొన్ని నిర్దుష్టమైన, నిర్దిష్టమైన లక్ష్యాలు మన స్ముల్లో పెట్టుకోవాలి ముందు. పిల్లలను కేవలం బిచ్చుగొట్టడంవల్ల, రెచ్చ గొట్టడం వల్ల ఏ ఫలితమూ సాధించలేము. వాళ్ళను బాగా అవగాహన చేసుకో వాలి. ఇంటా బైటా ఉన్న బాలవాఙ్మయాన్ని క్షుణ్ణంగా పరిశీలించాలి. గేయ రచనకు మాత్రాఛందస్సులోని మెలకువలు కరతలామలకం చేసుకోవాలి, పిల్లల లేలేత ముద్దుభాషలోని, ముగ్ధమోహనమైన భాషలోని, తేనెకన్న తీయని, వెన్న కన్న మెత్తని భాషలోని. ఊహలకు ఉనికియైన భాషలోని, కాకువుకు కారణ మైన భాషలోని స్వారస్యాన్ని సంపూర్ణంగా గ్రహించాలి.

ప్రౌఢ కవిత్వం వేరు, బాలకవిత్వం వేరు. కల్పన వేరు, వాస్తవికత వేరు. దేని ప్రత్యేకత దానిది. దేని ప్రయోజనం దానిది. సాహిత్యానికి సాంఘిక ప్రయోజనం ఉండాలి. జీవిత చిత్రణం వాస్తవికంగానే ఉండాలి ఆనందం అన్నింటి పర్యవసానమై ఉండాలి. అసలు పిల్లలను ఒరపిడి రాళ్ళు (Touch Stones) గా పెట్టుకొని ఈ బాల రచనా ప్రక్రియల్లో ముందుకు అడుగు వెయ్యాలి.

హాస్యం, చమత్కారం, యుక్తి పిల్లల నాకర్షిస్తాయి. సాహసం మితి మీరకుండా ఉంటే సరిపడుతుంది. కరుణకు కూడ స్థానం ఉంది. స్థూలంగా

చెప్పాలంటే పిల్లల్లో దౌర్బల్యాన్ని గుడ్డి నమ్మకాన్ని పెంపొందించేది బాల సాహిత్యం కానేరదు. దైవ విశ్వాసం, మత విశ్వాసం, రాజకీయ వాసనల ప్రవేశం బాల సాహిత్య ప్రాంగణంలో ఎంతవరకు సమంజసం, వాంఛనీయత అన్నది నిష్పక్షపాతంగా తేల్చుకోవాలి. పిల్లలందరూ అసలు మతాతీత రాజ్యాలు (Secular States) అని ఒప్పుకోవాలి.

దేవుణ్ణి నమ్మకుంటే అన్ని సుఖాలు ఒనగూడుతాయన్న అభిప్రాయాన్ని పెద్దలు కలిగి యుండడం ఎంత తప్పో, పిల్లలకు కలిగించడం అంతకు పదింతలు తప్పు. మనిషిలో పెరగవలసింది యత్నమూ సద్బుద్ధీను.

బాలసాహిత్యం పిల్లలమెదడులో కొన్ని మౌలికమైన భావాలను బలంగా నాటాలి.—ధైర్యం, నిజాయితీ, స్నేహభావం, త్యాగబుద్ధి, కార్యదీక్ష ఇలాంటివి. ఎన్ని కష్టాలు వచ్చినా అనుకొన్న మంచి పనిని సాధించే పాత్రలు గల కథలు పిల్లల్లో శీలాభివృద్ధిని పెంపొందిస్తాయి. ధన సంపాదనావకాశం అంతగా అందరికీ లేని మనదేశంలో గుణ సంపాదనావకాశమైనా ఉంటే చాలు.

అతి ప్రౌఢాలు, అన్వయక్లేశాలు, ధ్వనులూ వ్యంగ్యాలూ అంతస్సంఘర్షణలూ–ఇలాంటివి బాలసాహిత్యానికి అనవసరం.

ఈ స్పూత్నిక్ హైడ్రోజన్ బాంబు యుగంలో పిల్లలు తెలుసుకోవలసిన విషయాలెన్నో ఉన్నాయి. ఆరోగ్య సంబంధమైన అంశాలు వాళ్ల చిన్నప్పటి నుండీ తెలుసుకోవాలి. అడవిలో చెట్లలాగ ఈనాడు పిల్లలు ఏమీ తెలుసుకోకుండా పెరగడం చాలా తప్పు.

అన్నింటికంటే బాలగ్రంథాలదొక పెద్ద సమస్య. అచ్చు అందంగా ఉండాలి. మంచి కాగితం ఉండాలి పుస్తకాలు పిల్లలకు చౌకగా లేదా ఉచితంగా లభించాలి. ఇది సిద్ధించేదెన్నడో !

ముందు పిల్లలలో పఠనాశక్తి పెరగాలి. పిల్లలకు ఏ సందర్భంలోనైనా పుస్తకాలే కానుకలుగా ఇయ్యాలి.

పిల్లల హక్కులను గురించి 1924 లో నానారాజ్య సమితి జినీవా ప్రకటనలో, 1948 లో మానవ హక్కుల ప్రకటనలో 1959 నవంబరు 20 వ తేదీన ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లిలో పేర్కొనబడి, అన్ని దేశాలచేత ఆమోదింపబడడం జరిగింది. మన భారత రాజ్యాంగంలో పిల్లల హక్కులను గురించి కొన్ని ముఖ్యమైన నిబంధనలున్నాయి. అంతమాత్రాన చాలదు. ప్రపంచంలోని పెద్దలందరూ పిన్నల క్షేమాన్ని పవిత్ర కర్తవ్యంగా ఎంచి, వీటిని కార్యరూపంలోనికి తేవాలి, అప్పుడు పిల్లల జీవితాలు సుఖమయంగా ఆనందమయంగా సాగుతాయి. పిల్లలకు ఉజ్జ్వలమైన భవిష్యత్తు ఉంటుంది.

ఈ నా వ్యాస రచనకు తోడ్పడినవి : (Bibliography)


1. అఖిల భారత తెలుగు బాలల మహోత్సవ సంచిక-1974.
2. త్రివేణి (ఆంధ్రప్రదేశ జానపద గేయాలు).
3 సాహిత్యప్రయోజనం (వ్యాసావళి) కొడవటిగంటి కుటుంబరావు.
4. జానపదసాహిత్యం (వ్యాసమాల) టి.వి. శ్రీరామచంద్రాచార్యులు.
5. అభ్యుదయ-ఐదవ మహాసభ సంచిక-1955.
6. సాంప్రదాయిక విజ్ఞానం-బేకుమళ్ళ కామేశ్వరరావు.
7. బాలభాష-వేటూరి ప్రభాకరశాస్త్రి.
8. బాలగీతావళులు-శ్రీ వెంకటపార్వతీశ్వర కవులు.
9. యీసపు కథలు (తెలుగు-2 భాగాలు) కందుకూరి వీరేశలింగం.
10. నవ్వులు-పువ్వులు గొర్రెపాటి వెంకటసుబ్బయ్య.
11. బాలానందం-డాక్టర్ గిడుగు వేంకటసీతాపతి.
12. చంద్రవంక-కురంగేశ్వరరావు.
13. భారతీయ కవితాకల్పం-విద్వాన్ విశ్వం.
14. బాలవిజ్ఞాన కథలు-వేటూరి శివరామశాస్త్రి.
15. తెలంగాణా పల్లెపాటలు-డాక్టర్ బి. రామరాజు.
16. సుగమ విజ్ఞాన శాస్త్ర గ్రంథాలు-రావూరి భరద్వాజ.